# కళ్ళు మూసుకో
# ఏమికావాలో కోరుకో



మీరు పొదుపుచేసితే మీ కోర్కెలు నిజమవుతాయి. సైకిలా! బొమ్మరిల్లా! ఆటవస్తువా! ఏదయినా మీ డబ్బుతో మీర్హే కొనుక్కోవచ్చును. కెనరా బ్యాంక్ **బాల క్షేమనిధి** మీ కోసమే! అందమయిన **బాల క్షేమనిధి** పెట్టె మీ పైసలు దాచుకోవడానికి బాగుంటుంది. దానికి తాళము కూడ వేసుకోవచ్చును. మీ పెట్టె నిండగానే దగ్గిరగా వున్న కెనరా బ్యాంకులో డబ్బును జమచేసి తిరిగి దానిలో కూడబెట్టవచ్చును. మీ డబ్బు పెరుగుతూ వుంటుంది. ఎందుకంటే మేముకూడ కొంత మొత్తము కలుపుతాము కనుక. త్వరలోనే ఆ మొత్తము మీరు కోరుకొనిన వస్తువు కొనుక్కోటానికి సరిపోతుంది. మీ కోర్కెలు తీరడానికి ఏలాంటి గొప్ప పద్ధతో చూశారా! పొదుపు చేయడానికి యెంతటి అద్భుత మయిన పద్ధతో చూశారా!

మీకు దగ్గిరలోనున్న కెనరా బ్యాంక్ శాఖకి వెళ్ళి వివరములను తెలుసుకోండి.

మా యితర ప్రత్యేక ప్రణాళికలు
**కామధేను, నిరంతర, విద్యానిధి.**

# బాలక్షేమ నిధి




# కెనరా బ్యాంక్




(జాతీయ బ్యాంక్)
1200కు పైగా శాఖలు దేశమంతటా కలవు.

maa CB 4 Tel 80

**Results of Chandamama—Camlin Colouring Contest No. 15 (Telugu)**

*1st Prize:* S. Shanthi Kumar, Hyderabad-1. *2nd Prize:* P. Srinivas, Hyderabad-500 036. *3rd Prize:* Murali Krishna Reddy, Hyderabad-500 457. *Consolation Prizes:* Mr. Kanna, Vikrampur; P. Sri Hari Rao, Kurabalakota; Kadali Angi, Narsapur; V. Nagadhar, Nalgonda; Y. C. S. Moorty, Visakhapatnam.



# దీపావళికి వనిత

## ప్రత్యేక సంచిక

పోటీలో గెలుపొందిన పది కథలు

మరొక పెద్ద కథ

కొత్త కొత్త వివిధ ప్రాంతాల వంటకాలు

సౌందర్య పోషణకు సంబంధించిన వ్యాసాలు

వైద్య విషయాలు

కుట్లు, అల్లికలు, చేతిపనులు

పలు వర్ణచిత్రాలు

మరెన్నో విశేషాంశాలు గల

**వనిత**

దీపావళి పండుగకు పది రోజులు ముందుగానే వెలువడుతుంది

ఈ సంచిక వెల:

**ఆరు రూపాయలు**



[పోస్ట్ ద్వారా కావలసిన వారు మొత్తం రూ. 8-25 పంపితే, రిజిస్టర్డ్ పోస్ట్‌లో పంపబడుతుంది.]

డాల్టన్ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, మద్రాసు-600 026



# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ నెల బేతాళకథ [ ''ధర్మపరుడు'' ]కు ఆధారం గంగిశెట్టి శివకుమార్ రచన.

''పాతాళరాక్షసుడు'' అన్న కథలో తమ స్వార్థం కోసం, ఎలాంటి ఘోర కార్యాలయినా చేసే నర రూప రాక్షసులను గురించి తెలుసుకుంటాం. ఇలాంటి వాళ్ళను గుర్తించటం తేలికకాదు.

## అమరవాణి

పశ్య దానస్య మాహాత్మ్యం, సద్యః ప్రత్యయకారణమ్,
యత్రభావాదపి ద్వేషీ, మిత్రతాం యాతి తత్క్షణాత్.

[దానం ప్రభావం చాలా గొప్పది. అది వెంటనే నమ్మకం కలిగిస్తుంది. కోరినది యిచ్చిన తక్షణమే, శత్రువు కూడా మిత్రుడై పోతాడు.]



---

సంపుటి 67 అక్టోబర్ '80 సంచిక 4

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00








ఎం. సుకుమార్ జైన్, శివమొగ్గ (కర్ణాటక)

ప్ర : ప్రళయం కలిగేటప్పుడు ప్రపంచం నిజంగా మునిగిపోతుందా ? అంత నీరు ఎక్కడి నుంచి వస్తుంది ?

న: ప్రపంచం మీద అంతటా ప్రళయం వచ్చినట్టు పురాణగాథలు (నోవా, మనువు వగైరా కథలు) ఉన్నాయిగాని, శాస్త్రీయమైన ఆధారం లేదు. అయినా ప్రళయం వచ్చే మాటుంటే ప్రపంచాన్నంతటినీ ముంచగలిగినంత నీరు మంచుగడ్డ రూపంలో చాలా భాగం దక్షిణధ్రువ ప్రాంతానా, కొంత ఉత్తర ధ్రువ ప్రాంతానా ఉన్నది.

ఎస్. సురేశ్, అలెప్పీ (కేరళ)

ప్ర : అణువు బాంబు పేలుడు వల్ల ఫలితాలేమిటి ?

న: అణువు బాంబు పేలినప్పుడు ధార్మికశక్తి గల కొంత పదార్థం శక్తిగా మారుతుంది. పదార్థమంటే అపారమైన శక్తి యొక్క భౌతికరూపం మాత్రమే. అందుచేత అణువు బాంబు పేలినప్పుడు లయమైన పదార్థమంతా శక్తిగా మారుతుంది. ఈ శక్తి అనేక కోట్ల డిగ్రీల వేడి రూపంలోనూ, అమిత ప్రమాదకరమైన గామా కిరణాలు మొదలైన ప్రసారాల రూపంలోనూ ఒక్కసారిగా వెలువడుతుంది. వేడి సోకిన మేర ఎలాటి ఘనపదార్థమైనా కరిగిపోతుంది. కిరణప్రసారంతో పేలుడుకు దగ్గిరగా ఉండే ప్రాణులు రూపు మాసిపోతాయి. దూరాన ఉన్నవారికి సైతం లుకీమియా లాటి అపాయకరమైన వ్యాధులు కలుగుతాయి. పైకి ఏ ప్రమాదమూ జరగనట్టు కనబడినవారికి సైతం "రేడియేషన్" ప్రభావం వల్ల వికలాంగులైన పిల్లలు పుట్టవచ్చు.

ఈ దుష్ఫలితాలన్నీ అణువు బాంబుల పేలుడు చవిచూసిన హిరోషిమా, నగసాకి అనే జపాను పట్టణాలలో కలిగాయి. అయితే ఆ పట్టణాల మీద పడిన బాంబులకన్న చాలా శక్తివంతమైన బాంబులు ఈనాడు తయారై ఉన్నాయి. అందుకే ప్రపంచమంతటా వివేకవంతులు అణువుబాంబుల నిషేధాన్ని కోరుతున్నారు.




## 88

కోటను శత్రువుల ముట్టడికి తట్టుకునే లాగా భద్రపరిచే పని సేనాపతి అయిన సారసుడికి అప్పగించబడింది. కోట భద్రంగానే ఉన్నదనీ, తిండి గింజలూ, ఉప్పూ నిలవ ఉంచితే చాలుననీ సేనాపతి అన్నది.

ఇంతలో సింహళద్వీప రాజైన మేఘ వర్ణుడు సపరివారంగా వచ్చి, హిరణ్య గర్భుణ్ణి చూడగోరుతున్నట్టు కబురు వచ్చింది.

''మేఘవర్ణుడు వివేకి! అతన్ని ప్రవేశపెట్టండి.'' అన్నది హిరణ్యగర్భుడు.

''అతనికి ఎలా స్వాగతం చెప్పాలి? మిత్రుడుగానా, శత్రువుగానా, తటస్థుడు గానా?'' అని సర్వజ్ఞుడు అడిగింది.

''అది నేలపక్షి. ఆ కారణంగా చిత్ర వర్ణుడి పక్షం అనుకోవాలి. ఒకవేళ అది తనవారైన నేల పక్షులను వదిలేసి వచ్చి ఉంటే దాన్ని ప్రాణాలతో ఉండనియ్య రాదు. అది ఎంతో ప్రయాసపడి చాలా దూరంనుంచి వచ్చిన కారణంగా లోపలికి ప్రవేశపెట్టండి.'' అన్నది హంసరాజు హిరణ్యగర్భుడు.

''అలాగే! కోట భద్రంగానే ఉన్నది గనకనూ, మన చారులు వెళ్ళారుగనకనూ చిలక రాయబారిని కూడా ప్రవేశ పెట్టుదాం. అయితే, చాణక్యుడు నందుణ్ణి తన దూత చేత చంపించాడని మనకు తెలుసుగనక, తమరు రాయబారికి తగి నంత దూరంలో, అంగరక్షకుల మధ్య ఉండటం మంచిది.'' అన్నది సర్వజ్ఞ చకోరం.

సభలోకి చిలకా, మేఘవర్ణు డనే కాకీ పిలవబడ్డారు. చిలక వంగి నమస్కారం



చేసి, తనకోసం ప్రత్యేకించిన ఆసనం మీద కూర్చుని, ఇలా అన్నది :

"ఓ హిరణ్యగర్భా, నీకు నీ ప్రాణం మీద ఏమాత్రం తీపి ఉన్నప్పటికీ, రాజ్యం విడిచి పారిపోయే ఉద్దేశంలేని పక్షంలో, రాజాధిరాజైన మహాబలశాలి చిత్రవర్ణుడు వెంటనే నిన్ను తన వద్దకు వచ్చి, లొంగి పొమ్మని ఆజ్ఞాపిస్తున్నాడు."

హిరణ్యగర్భుడు ఆవేశంతో, "వీడి నోరు మూసేవారు ఈ సభలో ఎవరూ లేరా ?" అని గట్టిగా అరిచింది.

మేఘవర్ణుడు (కాకి), "మహారాజా, తమరు ఆజ్ఞాపించండి. ఈ నీచుణ్ణి ఇప్పుడే చంపేస్తాను," అన్నది.

"మహారాజా, దూత తన రాజుకు ప్రతినిధి. అతను ఎంత హీనుడైనా, ఎంత అమర్యాదగా మాట్లాడినా అతన్ని శిక్షించరాదు. అతను శిక్షార్హుడు కాని కారణం చేత, మరింత అమర్యాదగా మాట్లాడతాడు. అతన్ని విడిచిపెట్టి, తిరిగి పోనియ్యండి," అన్నది సర్వజ్ఞుడు.

హిరణ్యగర్భుడు తనను తాను నిగ్రహించుకుని, చిలకను తిరిగి పోనిచ్చింది. సర్వజ్ఞుడు దాన్ని అవతలికి తీసుకుపోయి, ఆనవాయితీ ప్రకారం దానికి ఇయ్యవలసిన బంగారమూ, ఇతర బహుమతులూ ఇచ్చి సాగనంపింది.

చిలక తన దేశానికి తిరిగి వచ్చింది.

"విశేషాలేమిటి ?" అని చిత్రవర్ణుడు అడిగింది.

"మహారాజా, యుద్ధ సన్నాహాలు చెయ్యండి. కర్పూరదేశం భూలోక స్వర్గమే, బలం గల దేశం కూడానూ ! కాని రాజు హిరణ్యగర్భుడూ, మంత్రి సర్వజ్ఞుడూ భీష్మించుకుని ఉన్నారు," అన్నది చిలక రాయబారి.

యుద్ధం తప్పదు గనక, కర్తవ్యం గురించి చిత్రవర్ణుడు తన మంత్రులతో చర్చించింది. దూరదర్శి (గద్ద) మంత్రి, తప్పనిసరి అయితేనే తప్ప యుద్ధానికి దిగరాదనీ, అప్పుడు కూడా తన బలమూ,

ఎదిరి బలమూ చూసుకుని మరీ దిగాలనీ, యుద్ధం తప్పటానికి చిన్న చిన్న రాజీ మార్గాలు చూడాలనీ అన్నది.

గద్ద ఇంకా ఇలా అన్నది:

"మంచి యోధులుగల చిన్న సేన అయినా, పిరికివాళ్ళూ, మంచి శిక్షణ లేనివాళ్ళూగల పెద్ద సేనకన్న మేలు. పిరికివాళ్ళ తిరోగమనం మంచివాళ్ళ ఓటమికి కారణం అవుతుంది. కీర్తీ, సన్మానమూ వీరత్వాన్ని ప్రోత్సహిస్తాయి. మనం అన్ని విషయాలూ క్షుణ్ణంగా ఆలోచించాలి."

రాజు చిరాకుగా, "ఎందుకొచ్చిన నోటి దురద! ఘనం వెంటనే దాడి చేతాం," అంటూ లేచి, అంతకుముందే జ్యోతిష్కులు నిర్ణయించిన ముహూర్తాన సైన్యంతో సహా బయలుదేరింది.

చిత్రవర్ణుడు దండెత్తి వస్తూ, మలయ పర్వతం మీద విడిసి ఉన్నట్టు హిరణ్యగర్భుడికి త్వరలోనే వార్త అందింది. చిత్రవర్ణుడి గూఢచారి ఎవరో కోటలో ఉన్నట్టు సూచనలు కనబడ్డాయి. అందుచేత కోటను గాలించే అవసరం కలిగింది.

సర్వజ్ఞుడికి మేఘవర్ణుడు (కాకి) మీద అనుమానం పోయింది.

"అది సమంజసం కాదు. శత్రువు గూఢచారి అయితే ఆ కాకి శత్రువు దూత



అయిన చిలకను చంపటానికి ఎందుకు సిద్ధపడింది? అదీగాక, యుద్ధ ప్రకటనకు చాలా ముందుగానే అది మన వద్దకు వచ్చింది," అన్నది హిరణ్యగర్భుడు.

"అయినప్పటికీ, అది పరాయిది. దాన్ని నమ్మరాదు," అన్నది సర్వజ్ఞుడు.

"పరాయివాళ్ళయినంత మాత్రాన శంకించనవసరంలేదు. అయినవారిలాగే, పరాయివారిలో కూడా మంచివాళ్ళూ, చెడ్డవాళ్ళూ, ఏదీకానివాళ్ళూ ఉంటారు," అన్నది రాజు.

"కాని మంత్రులు తమ అభిప్రాయం తెలపటం ధర్మం. రాజు వద్ద నిజం దాచే వైద్యుడూ, పురోహితుడూ, మంత్రీ రాజు

యొక్క ఆరోగ్యాన్నీ, నీతినీ, సౌభాగ్యాన్నీ పోగొట్టుతారు,'' అన్నది సర్వజ్ఞుడు.

''ఇప్పుడు ఏం చెయ్యాలి? చిత్రవర్ణుడు తన మంత్రి అయిన గద్ద సలహాను తోసిపుచ్చి, మన మీదికి దండెత్తి వస్తున్నట్టు మన చారుడి ద్వారా తెలుస్తున్నది. శత్రు సైన్యం ప్రయాణంతో బడలి ఉంటుంది. వాటికి ఈ ప్రదేశమూ, ఇక్కడి నదులూ, కొండలూ తెలియవు. మనం దెబ్బ తియ్యటానికి ఇదే మంచి తరుణం. స్వారస వెళ్లి ఈ పని చెయ్యాలి,'' అన్నది రాజు.

ఇలాగే జరిగింది. చిత్రవర్ణుడి బలాలలో పురోగమించుతున్నవి కొండలలోనూ, అడవులలోనూ, దారులలోనూ నాశనమయాయి.

ఓటమి పొందిన చిత్రవర్ణుడు దూరదర్శునుణ్ణి సలహా అడిగింది. తొందరపడి యుద్ధం తలపెట్టినందుకు దూరదర్శనుడు రాజును మందలించింది. సేనలను ఉపసంహరించే ఉపాయం చూడమని రాజు అడిగితే, దూరదర్శనుడు, ''నిరాశ పడవద్దు. ఉపాయం ఉన్నది. బలాలను కోట మీద కేంద్రీకరించు,'' అన్నది.

ఈ సంగతి చారుడుగా వెళ్ళిన కొంగ చెప్పగానే, సర్వజ్ఞుడు హిరణ్యగర్భుడితో, ''కోటను భద్రపరుచు. ఖర్చు లెక్క చెయ్యక, సైనికులకు పుష్కలంగా ధనం ఇచ్చి, వాళ్లు కోటను కాపాడేటట్టు చెయ్యి,'' అన్నది.

కోట నుండి బయలుదేరి, శత్రువుతో తలపడతానని మేఘవర్ణం (కాకి) అంటే, సర్వజ్ఞుడు ఒప్పుకోక, అందరూ కోటను లోపలినుంచే రక్షించాలన్నది.

అందుచేత, చిత్రవర్ణుడి సేనలు కోటను ముట్టడించినప్పుడు, ద్వారాలన్నిటివద్దా తీవ్ర పోరాటాలు జరిగాయి. హిరణ్యగర్భుడి సైనికులు ఇలా పోరాడుతూంటే, మేఘవర్ణుడూ, ఇతర కాకులూ కోట లోపలి ఇళ్ళ మీద మండుతున్న కట్టెలు వేసి, ''నిప్పు! నిప్పు! కోట లొంగిపోయింది!'' అని కేకలు పెట్టాయి.






## 6

[సేనాని సమరసేనుడూ, సైనికులూ అరణ్యంలో చతుర్నేత్రు డనే మాంత్రికుడి కంట బడ్డారు. మాంత్రికుడు వాళ్ళను ప్రశ్నిస్తూండగా అక్కడికి, చతుర్నేత్రుడి శత్రువైన ఏకాక్షి మాంత్రికుడు వచ్చాడు. ఆ మాంత్రికుల సేవకుల మధ్య భయంకర పోరాటం సాగింది. వాళ్ళు వెళ్ళిపోయాక దాపులనున్న అగ్నిపర్వతం నుంచి జ్వాలలు లేచినై. తరవాత—]

సమరసేనుడూ, సైనికులూ భయభ్రాంతులై చూస్తున్నంతలో, అగ్నిపర్వతం నుంచి పొగా, జ్వాలలతో పాటు కళ్ళను మిరుమిట్లు గొలిపే నిప్పురవ్వలు ఎగిరి రాసాగినై. ఆ చుట్టు పక్కల ప్రదేశమంతా పొగతో నిండిపోయింది.

సమరసేనుడు పోవలసిన మార్గంలోనే, యీ అగ్నిపర్వతం బద్దలయింది. ఆ పరిస్థితుల్లో తూర్పు తీరం చేరేందుకు మరొక దారిన పోవలసిన అవసరం ఏర్పడింది. సమరసేనుడు వెను దిరిగి దారి తీశాడు. భయకంపితులై వున్న సైనికులు మారు మాటాడకుండా తమ సేనానిని అనుసరించారు. ఇప్పుడు అందరూ పడమటి దిక్కుకేసి నడుస్తున్నారు. వాళ్ళు వదిలి వచ్చిన ఓడలు తూర్పు తీరంలో వున్నవి. కాని, వాళ్ళను ఒక వంక మాంత్రికులూ, క్రూరమృగాలే కాక



ఇప్పుడు యీ అగ్నిపర్వతం కూడా బద్ధలై పోవలసిన దారిని అడ్డుకోవడంతో, వాళ్ళు సూటిగా తూర్పు తీరానికి నడిచే అవకాశం పోయింది.

గుబురుగా పెరిగిన చెట్లలో నుంచీ, తుప్పలలో నుంచీ దారి చేసుకుని సమర సేనుడూ, సైనికులూ ముందుకు నడుస్తు న్నారు. ఇంతలో అగ్నిపర్వతం నుంచి రాళ్ళు కరగగా వెలువడిన ద్రవం పొగలు కక్కుతూ పల్లపు ప్రాంతాలకు ప్రవహిస్తు న్నది. వన్యమృగాలు భయంతో అరుస్తూ, నలుమూలలకూ పరిగెత్తసాగినై. ఇది చూసి సమరసేనుడూ, సైనికులూ భీతా వహులయారు.

సమరసేనుడు చుట్టూ ఓ మారు పరికించి చూశాడు. సలసల కాగుతూ ప్రవహిస్తున్న ద్రవం, దాట శక్యం గాని నదిగా తయారవక ముందే, ఏదో ఒక ఎత్తయిన ప్రదేశాన్ని చేరటం మేలను కున్నాడు. అలా కాకపోతే వెచ్చని పొగలు కక్కుతున్న అగ్నిపర్వతపు శిలా ద్రవం నుంచే కాక, భయంతో పరుగు లెత్తే క్రూరమృగాల బాధ కూడా ఎదు రవుతుంది.

సమరసేనుడు, సైనికులకు ధైర్యం చెబుతూ ముందుకు నడుస్తున్నాడు. హఠాత్తుగా అతడికి ఒక వింత దృశ్యం కంట బడింది. ఇది నిజమా, భ్రమా అన్నంత అనుమానం కలిగింది సమర సేనుడికి. కాని, మరి నాలుగు అడుగులు వేసే సరికి తను చూస్తున్నది అక్షరాలా నిజమే అని రూఢి అయిపోయింది.

సమరసేనుడు ఆగి, సైనికులను జాగ్రత్త అంటూ హెచ్చరించాడు. ఎదు రుగా వున్న చెట్టు కొమ్మనుంచి మనిషి ఒకడు తలకిందులుగా వేళ్ళాడు తున్నాడు. వాడిలో ప్రాణం వున్నదో లేదో తెలియదు. కాళ్ళూ, చేతులూ తీగ లతో బంధించబడి వున్నవి. వాడి ముఖ లక్షణాలు చూస్తే, ఒక అడవి జాతి వాడని అర్థమవుతున్నది.

సేనానితో పాటు సైనికులూ నిశ్చేష్టులై యీ వింత చూస్తున్నారు. ఈ మంత్రాల దీవిలో క్రూరమృగాలూ, మాంత్రికులే కాదు—మామూలు మనుషులు కూడా నివసిస్తున్నారని వాళ్ళకు తెలిసింది. '' ఈ అడవి మనిషికి యింత కఠినమైన శిక్ష విధించిన వాళ్ళెవరై వుంటారు ?'' అన్నాడు సమరసేనుడు.

సైనికులు మాట్లాడలేదు. సమరసేనుడు వాళ్ళతో, '' వీడు అడవి జాతికి చెందినవాడు. వీళ్ళ నివాసస్థానాలు ఎక్కడున్నవో కనుక్కోవాలి. అలా తెలుసుకోవటం ముందు, ముందు మనకెంతగానో ఉపయోగిస్తుంది, '' అన్నాడు.

సైనికులు ఎప్పుడు తూర్పు తీరం చేరి, పడవలెక్కి తమరాజ్యం చేరదామా అన్న ఆత్రంలో వున్నారు. అందువల్ల వాళ్ళకు సేనాని మాటలు రుచించ లేదు. మన దారిమనం చూసుకోక, యీ అడవి మనుషుల నివాసస్థానాల కోసం వెతకడం దేనికి? అనిపించింది వాళ్ళకు.

సైనికుల మౌనంచూసి సమరసేనుడు ఏమీ అనలేక పోయాడు. తనకూ త్వరలో తూర్పు తీరం చేరాలనే వున్నది కాని మార్గం ఏది? అతడు మరొకడుగు ముందుకు వేసి, తలకిందులుగా వేళ్ళాడుతున్న వాణ్ణి పరీక్షగా చూశాడు. వాడి






శరీరం మీద గాయాల లాంటివి ఏమీ లేవు. బహుశా విరోధులు యిలా వేళ్ళాడ దీసి వుంటారు. వీడు ఆకలి దప్పులతో అలమటించి మరణించి వుంటాడు, అనుకున్నాడు సమరసేనుడు.

ఆ చచ్చిన వాణ్ణి చూస్తుంటే అందరికీ జాలికలిగింది. సమరసేనుడు సైనికులతో, "ఇందులో నిగూఢమైన రహస్యం ఏదో వుండి తీరాలి. ఇది తెలుసుకోవడం ఎలా? ఒకటి మాత్రం నిజం; యీ దీవిలో కొంత ప్రదేశం మానవులకు నివాసయోగ్యమై వున్నది. వీడి భయంకర మరణానికి కారణం ఏమిటో తెలుసుకోవాలి," అన్నాడు.

అంతలో సమరసేనుడి దృష్టి కొంచెం దూరాన పడివున్న ఒక వస్తువు మీద పడింది.

ముందుకు పోయి ఆ వస్తువును చేతిలోకి తీసుకున్నాడు. అది పగిలి పోయిన ఒక సొరకాయ బుర్ర. దాని మూతి సన్నగా వున్నది, దాని కొక తాడు బిగించి వున్నది. అడుగు పగిలిన ఆ సొరకాయ బుర్రను ఎవళ్ళో అక్కడ పారవేసి పోయారు. పరీక్షించి చూడగా, అది ప్రయాణాల్లో నీళ్ళు మోసుకు పోవడానికి ఉపయోగించే సాధనంలా వున్నది.

"ఆహాc, అంతా కుండలినీ దేవి కరుణ!" అంటూ సమరసేనుడు ఆకాశం కేసి చూస్తూ, చేతులెత్తి నమస్కరించాడు.

తమ నాయకుడు యిలా చేయడానికి కారణం ఏమిటో సైనికులు ఊహించలేక పోయారు. వాళ్ళ ఆశ్చర్యం చూసిన సమరసేనుడు, "ఇక భయం లేదు. మానవులు నివసించే ప్రదేశానికి మనం దగ్గరలోనే వున్నాం. ఈ నిర్భాగ్యుణ్ణి ఏ మాంత్రికులో కాక, తోటి మనుషులే ఇలా తలకిందులుగా వేళ్ళాడ దీశారు. ఈ సొరకాయ బుర్ర మనుషులు ఉపయోగించేదే. అందువల్ల మనం కొంచెం జాగ్రత్తగా వెదికితే, ఆ మనుషులు

యిక్కడికి ఏ దారిన వచ్చారో, ఏ దారిన వెళ్ళారో అనవాళ్ళు తెలియక పోవు!'' అన్నాడు.

మరుక్షణం సైనికులు, ఆ ప్రాంతంలో మనుషులు తొక్కిన కాలిబాట లేమైనా కనబడత వేమో అని వెతక సాగారు. కొద్ది సేపట్లోనే వాళ్ళ శ్రమ ఫలించింది. ఒక పచ్చిక బయలుమీద కనిపించిన గుర్తులు చూస్తే, ఎంతోమంది మనుషులు గుంపులు, గుంపులుగా ఆ బయలు మధ్య నుంచి నడిచి పోయినట్టుగా అర్థమయింది.




అందరూ ఉత్సాహంగా ఆ బాట వెంట నడవసాగారు. ఒక్క అరగంట సేపటిలో వాళ్ళు, ఒకానొక ఎత్తయిన ప్రదేశం చేరుకున్నారు. అక్కడ నిలబడి చుట్టూ కలయ చూశారు. అగ్ని పర్వతం యింకా మంటలు గుప్పిస్తూనే వున్నది. ప్రాణ భీతితో అడవిజంతువులు పరిగెత్తుతూనే వున్నాయి. వాటి అరుపులు కర్ణకఠోరంగా వినబడు తున్నవి. దూరంగా ఒకటి రెండు ప్రదేశాల్లో అడవి తగలబడుతున్న సూచనగా మంటలు లేస్తున్నవి.

సమరసేనుడు ముందు నడుస్తుండగా సైనికులు అతణ్ణి అనుసరించారు. ఏ క్షణంలోనైనా మాంత్రికులు గాని, క్రూర మృగాలు గాని తమ దారిని అడ్డగించ వచ్చన్న భయం అందరినీ పట్టి పీడిస్తున్నది. అందరూ మనసులో కుండలినీ దేవిని స్తోత్రం చేయసాగారు. కత్తులూ, విల్లంబులూ సిద్ధంగా వుంచుకొని నడుస్తూ, కొంత సేపటికి వాళ్ళొక నదీ తీరాన్ని చేరారు.

నదీజలం విపరీతమైన వేగంతో ప్రవహిస్తున్నది. నది మధ్య అక్కడా, యిక్కడా పెద్ద రాళ్ళున్నవి. వాటిని ప్రవాహం తాకినప్పుడల్లా పెద్ద రణగొణ ధ్వని అవుతున్నది. ఈ నది దాటి అవతలికి పోవటమా, మానటమా? అన్న సంశయం కలిగింది, సమరసేనుడికి. తాను చేరవలసిన చోటుకు మార్గమేదో

13

స్పష్టంగా తెలియనప్పుడు, నదికి యివతల వున్నా అవతలకు చేరినా ఒకటే అనిపించిందతడికి.

వాళ్ళు పోవలసింది తూర్పు సముద్ర తీరానికి. కాని దారిలో అగ్నిపర్వతం బద్దలయిన కారణంగా మరొక దిక్కుకేసి నడుస్తున్నారు. సమరసేనుడు ఏమి చేయటమా అని ఆలోచిస్తూండగా సైనికు డొకడు, "సేనానీ, ఈ నది దాటడం అంత తేలికైన పని కాదు," అన్నాడు.

"ఔనౌను!" అని జవాబిచ్చి సమర సేనుడు మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. పొడవాటి తాడు వంటిది ఏమైనా దొరికితే, నది దాటటం కష్టంకాదు. ఈ మాటే సైనికులతో అన్నాడు. ఈ అరణ్య మధ్యంలో తాళ్ళంటూ ఎక్కడ దొరుకుతవి?

సైనికులు దాపులనున్న చెట్ల దగ్గిరకు పోయి, వాటిని అల్లిబిల్లిగా అల్లుకుని వున్న తీగలను తెంచి, వాటితో ఒక బల మైన మోకును తయారు చేశారు. ఆ మోకు కొస నొకదాన్ని నది ఒడ్డున వున్న చెట్టు మొదలుకు కట్టారు. రెండవ కొస పట్టుకుని, ఒక్కొక్కరే దాని అసరాతో, నదీ ప్రవాహంలోని బండరాళ్ళ మీది నుంచి, అవతలి ఒడ్డుకు నడవజొచ్చారు. కొంత సేపటికి అందరూ సురక్షితంగా నది అవతలి ఒడ్డు చేరారు. సమర



సేనుడు, సైనికులను హెచ్చరించి దాపుల నున్న ఒక ఎత్తయిన దిబ్బపైకి పోయాడు. దాని దిగువున అంతగా చెట్లు లేవు. కాని, మరి కొంత దూరం ముందుకు పోతే, ఆ ప్రాంతమంతా గుబురు చెట్ల మయం.

సమరసేనుడు చుట్టూ కొంచెం కలయ చూసి, దిబ్బ పైనుంచి దిగాడు. సైనికులు అతణ్ణి అనుసరించారు. అక్కడ పచ్చికలో వున్న కాలి గుర్తుల వెంట కొంతదూరం నడిచి, గుబురు చెట్ల మధ్యకు చేరారు.

హఠాత్తుగా వాళ్ళకు ఏనుగుల ఘీంకారాలు వినిపించినై. సైనికులు భయ కంపితులై పోతూ, తమ నాయకుడి కేసి

చూశారు. సమరసేనుడు, సైనికులకు హెచ్చరిక చెబుతూనే, వేగంగా పోయి ఒక చెట్టు మీదికి ఎగబాకాడు. సైనికులు కూడా అతడి వెంట చెట్టు మీదికి వెళ్ళారు. ఆ మరుక్షణం చిన్న ఏనుగుల మంద ఒకటి ఘీంకరిస్తూ, ఆ ప్రదేశానికి వచ్చింది.

అరణ్యంలో చాలా చోట్ల రేగిన మంటల్లో చిక్కుకోకుండా ఏనుగులు పారిపోతున్నవి! వాటి కాళ్ళ తాకిడికి భూమి ప్రతిధ్వనిస్తున్నది. చిన్న చిన్న మొక్కలూ, పొదలూ, తుప్పలూ వాటి కాళ్ళకింద పడి నుగ్గునుగ్గు అయిపోతున్నవి.

చెట్లపైకి ఎగబాకిన సమరసేనుడూ, సైనికులూ ఆ ఏనుగుల మందను చూసి హడలిపోయారు. క్షణ కాల మాత్రం, చెట్టెక్కడం ఆలస్యం అయితే, ఏనుగుల కాళ్ళకింద పడి మనం కూడా పిండి పిండి అయిపోయే వాళ్ళం కదా! అదృష్టం బావుండి చేరువనే చెట్లు వుండటం చేత బతికి బయట పడ్డాం; అనుకున్నారు వాళ్ళు.

మరికొంత సేపటికి ఏనుగుల మంద ఆ ప్రదేశం వదిలిపోయింది. అయినా సమరసేనుడికీ, భయకంపితులై వున్న సైనికులకూ చెట్టు మీది నుంచి దిగడానికి భయంగానే వున్నది.

ఏనుగుల ఘీంకార శబ్దం బాగా దూరమైపోయాక, యింకా గుండెలు పీచు పీచుమంటూండగా సమరసేనుడూ, సైనికులూ చెట్టుమీది నుంచి కిందికి దిగారు. వాళ్ళు దిక్కులు చూస్తూ, ఎక్కడ ఏ పాటి చప్పుడు అయినా హడలిపోతున్నారు. ఈసారి మళ్ళీ తాము అనుసరించి వస్తున్న కాలిబాట కోసం వెతికారు కాని, దాని ఆనవాలే కనబడలేదు. ఏనుగుల పాదాల కింద నలిగి ఆ ప్రదేశమంతా చదునైపోయి, అంతా ఒకటిగానే కనబడుతున్నది. ఇప్పుడేం చేయాలి? అన్న ప్రశ్న ఎదురై అందరూ దిక్కులు చూడసాగారు. —(ఇంకా వుంది)



18



# ధర్మపరుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు చేస్తున్న ఈ పని ధర్మమా, అధర్మమా అని విచారించటం నిరుపయోగం. నీ కృషి విజయవంత మవుతుందా, కాదా అన్నదే ముఖ్యం. సింహపురి రాజైన నరసింహవర్మ అంతటి ధర్మపరుడు విజయం కోసం ఘోరమైన అధర్మానికి ఒడిగట్టాడు. శ్రమతెలియకుండా నీకు అతని సంగతి చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

శోణపురం రాజు జయపుర రాజుకు సామంతుడు. శోణపురం చిన్న రాజ్యమే అయినా మంచి ఒనరులు గలది. జయపురం రాజు జయదేవుడు శోణపురాన్ని

## బేతాళ కథలు



రక్షించటమే గాక, దాని సిరిసంపదలను అభివృద్ధిలోకి తెచ్చాడు.

ఆ కారణం చేతనే మణిపురరాజు మణిమంతుడికి శోణపురం మీద కన్నుపడింది. అతడు ఆకస్మికంగా ఆ చిన్న రాజ్యం మీద దాడిచేసి, ఆక్రమించుకున్నాడు.

ఈ సంఘటనతో జయదేవుడు పెద్ద చిక్కులో పడ్డాడు. శోణపురాన్ని రక్షించే భారం తనమీద ఉన్నప్పటికీ, మణిమంతుణ్ణి యుద్ధంలో జయించగల బలం అతనికి లేదు. అందుచేత అతను తన మంత్రి సలహాపైన సింహపుర రాజైన నరసింహవర్మ సహకారాన్ని అర్థించాడు. జయపురానికీ, సింహపురానికీ అనాదిగా మైత్రి వున్నది. నరసింహవర్మ పేరు మోసిన ధర్మపరుడు. జయపురానికీ, శోణపురానికీ ఏర్పడిన సమస్యలు పరిష్కరించడానికి, తాను తోడ్పడటం ధర్మం అని నమ్మి, మణిపురం మీదికి యుద్ధానికి బయలుదేరాడు.

ఉభయ పక్షాలకూ రెండు రోజుల పాటు యుద్ధం సాగినాక విజయం మణిపురానికి లభించటం ఖాయం అని స్పష్టంగా తేలిపోయింది. ఆ పరిస్థితిలో జయదేవుడు నరసింహవర్మకు ఒక కపటోపాయం సూచించాడు. నరసింహవర్మ దాన్ని అమలుచేయటానికి సమ్మతించి, మర్నాడు మణిపురరాజుతో ఏకపక్ష సంధి చేసుకుని, రణరంగం నుంచి తన బలాలను ఉపసంహరించాడు.

ఆ రాత్రి మణిపుర సైనికశిబిరంలో సైనికులూ, సేనాపతులూ విజయోత్సాహంతో తాగితందనాలాడుతుండగా, జయపుర సైనికులతో బాటు, సింహపురి సైనికులు కూడా వచ్చిపడి, మణిపుర సైనికులను దారుణంగా వధించి, మణిపుర రాజును బందీగా పట్టుకున్నారు.

శోణపురం తిరిగి విముక్తి పొందింది. జయపురరాజు కృతజ్ఞతలు అందుకుని, నరసింహవర్మ తన సేనలతో సహా తన దేశానికి తిరిగి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, నరసింహవర్మ ఏమన్న ధర్మపరుడు? ధర్మపరుడు అయిన వాడు జయదేవుడు సూచించిన దుర్మార్గానికి ఒప్పు కుంటాడా? అలా చేసి అతను తనకు గల కీర్తిని ఎందుకు బుగ్గిపాలు చేసు కున్నాడు? మణిమంతుడి లాటి బలవంతుణ్ణి నిర్వీర్యుణ్ణి చేయాలన్న ఉద్దేశంతోనా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నరసింహవర్మ జయదేవుడి పథకాన్ని అమలు చేసి ధర్మం తప్పాడనటానికి వీల్లేదు. ధర్మ నిర్ణయం పరిస్థితులకు అనుగుణంగా జరగాలి. శోణపురాన్ని శత్రువుల నుంచి కాపాడటం జయదేవుడి ధర్మం. ఆ పని చేసే శక్తి జయదేవుడికి చాలినంత లేని కారణం చేత అతను నరసింహవర్మ సహాయం అర్థించాడు. అతనికి సహాయం చెయ్యటం తన ధర్మంగా నరసింహవర్మ భావించాడు. అది ధర్మయుద్ధంతో సాధ్యం కానప్పుడు, అధర్మయుద్ధం అవసరమయింది. నరసింహవర్మ జయదేవుడి ఎత్తుగడను నిరాకరించి యుద్ధం మాని వెళ్ళిపోయి వుంటే, అతను మణిపురరాజు పట్ల ధర్మంగా ప్రవర్తించిన వాడు అనిపించుకునే వాడేమో గాని, జయదేవుడి పట్ల అధర్మంగా ప్రవర్తించిన వాడే అయేవాడు! నిజానికి నరసింహవర్మ పూనుకున్నది జయదేవుడి పట్ల తన ధర్మం నిర్వర్తించటానికి గద! అదే అతను చేశాడు. ఆ మాటకు వస్తే యుద్ధం చెయ్యటమే అధర్మం అనవచ్చు. సామంతో పని జరగకపోతే దండం అవలంబించినట్టే, ధర్మయుద్ధంతో ధర్మ నిర్వహణ సాధ్యం కాకపోతే ఆ పనిని అధర్మయుద్ధంతో నిర్వహించటం తప్పు కాదు!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# సాధు స్వభావం

ఒకసారి ఒక రాజు అడవిలో వేటకు వెళ్ళి, అడవి అంచున ఉన్న ఒక సాధువు ఆశ్రమంలో తన ఆభరణాలను భద్రపరిచి, అరణ్యం ప్రవేశించాడు.

ఇది తెలిసి ఇద్దరు దొంగలు రాజుగారి ఆభరణాలు కాజేసే ఉద్దేశంతో సాధువు వుండే కుటీరానికి వచ్చారు. సాధువు వారిని చూస్తూనే వారి ఉద్దేశం గ్రహించి, ముందుగా తానే రాజుగారి ఆభరణాలను వారికి ఇస్తూ, మందహాసం చేసి, "పట్టుకుపొండి!" అన్నాడు.

దొంగలు సాధువు కేసి నివ్వెరపోయి చూడసాగారు. సాధువు వారితో ఇలా అన్నాడు:

"దొంగతనం మహా పాపం! మిమ్మల్ని ఆ పాపానికి గురి చెయ్యటం ఇష్టం లేక, నా అంతట నేనే ఈ నగలు మీకు ఇచ్చేస్తున్నాను. పరం సంగతి ఇలా ఉండగా, ఈ నగలు మీరు దొంగిలించి పట్టుబడితే రాజుగారు మిమ్మల్ని తల తీయిస్తాడు. అందుకని రాజు గారితో, ఈ నగలను నేనే మీకిచ్చినట్టు చెబుతాను."

దొంగలు ఒక్క క్షణం సాధువు కేసి వింతగా చూసి, నగలు తీసుకో కుండా వెళ్ళి పోయారు.

—మల్లాది వెంకటకృష్ణమూర్తి.

16



19



# కాలక్షేపం కథ

సత్రం గదిలో ముగ్గురున్నారు. బయట హోరుగాలితో పెద్ద పెట్టున వర్షం కురుస్తున్నది.

"నా పేరు చలపతి. మీ పేర్లు కూడా చెప్పండి," అన్నాడు ముగ్గురిలో ఒకడు. మిగిలిన వాళ్ళు భూపతి అనీ, గజపతి అనీ తమ పేర్లు చెప్పారు.

"ఈ వర్షం రాత్రి మనకు నిద్ర పట్టేలా లేదు. ఏదైనా కాలక్షేపం ఏర్పాటు చేసుకుందాం," అన్నాడు చలపతి.

అందుకు మిగతా ఇద్దరూ సమ్మతించారు. "ముందుగా నేను మొన్నరాత్రి జరిగిన సంఘటన చెబుతాను," అంటూ చలపతి ఇలా చెప్పాడు:

ఆ రోజు అనుకోకుండా వర్షం ప్రారంభమయింది. అతనికి ఊరు కొత్త! చలపతి చేసేదేమీ లేక ఊరు చివర ఉన్న పాడుబడిన ఇంటి చూరు కింద నిలబడ్డాడు.

చలపతి పాడగలడు. వాడు కాలక్షేపం కోసం, గాలి హోరుతో పోటీ పడుతూ, గొంతెత్తి పాడసాగాడు.

దారి వెంట వెళుతున్న ఒక గుర్రపు బండి అక్కడ ఆగింది. చలపతి పాట ఆపలేదు. కొద్దిసేపటికి, బండికి ఉన్న పట్టుతెరలను తొలగించుకుని, ఒక ధనికుడు బండి దిగి, వర్షంలో తడుస్తూ, చలపతిని సమీపించి, "భేష్! బ్రహ్మాండంగా పాడుతున్నావు! మా కుటుంబాన్ని పుట్టింట దించి వస్తున్నాను, నాకు కాలక్షేపం కావాలి. మా ఇంటికి వచ్చి, నీ పాటతో నన్ను ఆనందింప జెయ్యి!" అంటూ, చలపతిని చెయ్యి పట్టుకుని ఆప్యాయంగా తీసుకువెళ్ళి, బండీలో కూర్చోబెట్టాడు.

చలపతి ఆ ధనికుడి వెంట అతని ఇంటికి వెళ్ళి, అర్ధరాత్రి దాకా తన పాట

మాచిరాజు కామేశ్వరరావు



లతో అతన్ని ఆనందింపజేశాడు. తరవాత ఇద్దరూ భోజనం చేసి, పడుకున్నారు. ధనికుడు నిద్రపోగానే చలపతి, అందినంత డబ్బు మూట గట్టుకుని, ఆ ఇంటి నుంచి బయటపడ్డాడు.

ఈ విషయం చెప్పటం పూర్తి చేస్తూ చలపతి, "కొందరు మూర్ఖులు కాలక్షేపం పేరుతో అమూల్యమైన కాలాన్ని వృథా చెయ్యడమే కాకుండా, లేనిపోని ఆపదలు తెచ్చుకుంటూ ఉంటారు. ఇంతకూ చెప్పవచ్చే దేమిటంటే, నేను భోజనం చేసి వస్తూనే, భూపతి నా డబ్బుల మూటను తన బట్టలమూటలో దాయడం చూశాను. నా జాతికి చెందినవాడే కదా అని నవ్వుకున్నాను. నా మూట నేను తీసుకుంటాను," అంటూ భూపతి బట్టల మూట నుంచి తన డబ్బుమూటను తీసేసుకున్నాడు.

భూపతి అభ్యంతరం చెప్పక, ఆ నాటి తన అనుభవం గురించి ఈ విధంగా చెప్పాడు: మొన్నరాత్రి వర్షం కురుస్తున్నప్పుడు భూపతి అక్కడికి పది మైళ్ళ దూరంలో ఉన్న ఒక పల్లెలో ఉన్నాడు. అది అతనికి కొత్త ఊరు. అక్కడ తనకు ఏం దొరుకుతుందా అని వెతుకుతూండగా చీకటి పడింది. ఆ ఊరి రామాలయంలో హరికథా కాలక్షేపం ఏర్పాటు అయి ఉండడంవల్ల గ్రామస్థులు భోజనాలు చేసి, ఒకరొకరే రామాలయానికి చేరుకుంటున్నారు.

భూపతి ఒక రెడ్డిగారి దొడ్డిలో గడ్డివామి వెనక నక్కి ఉన్నాడు.

రెడ్డిగారి తల్లి హరికథకు పోదామని పోరుపెడుతున్నది. రెడ్డిగారికి మాత్రం ఇష్టంలేదు.

"మనతో బాటు డబ్బు రాదు. వచ్చేవి పాపపుణ్యాలే! పుణ్యం చేయక పోతే మానె, నాలుగు మంచి మాటలు చెవిని వేసుకుంటే నీ సొమ్ము ఏమీ పోదు!" అంటూ ముసలావిడ రెడ్డిగారినీ, తన కోడలినీ కూడా కాలక్షేపానికి

బయలుదేర దీసింది. వాళ్ళు ఇంటికి తాళం పెట్టి, వెళ్ళిపోయారు.

ఇంతలో హోరుగాలితో వర్షం ఆరంభ మయింది. ఆ రొదలో భూపతి రెడ్డిగారి పెరటి తలుపు పగలగొట్టడం ఎవరికీ వినిపించలేదు. భూపతి లోపలికి వెళ్ళి, దొరికిన నగలు మూట గట్టుకుని, వర్షం లోనే చీకట్లో కలిసిపోయాడు.

భూపతి తన కథ ముగిస్తూ, "హరి కథా కాలక్షేపం వాళ్ళ కొంప. కూల్చింది. నా నగల మూట ఇప్పుడు గజపతి దగ్గిర ఉన్నదని నాకు తెలుసు. నాది నేను తీసుకుంటాను!" అని గజపతి మొలలో దాచి ఉన్న తన నగల మూటను తాను తీసేసుకున్నాడు.

గజపతి నగల మూట ఇచ్చేసి, తన అనుభవం చెప్పసాగాడు :

ఆ రాత్రి గజపతి మరో ఊళ్ళో ఉన్నాడు. అతని చేతిలో కానీ లేదు. ఆశగా అన్ని ఇళ్ళలో తొంగి చూస్తు న్నాడు. ఇంతలో పెద్ద గాలి దుమారం సాగింది. గజపతి ఒక ఇంటి అరుగు ఎక్కి, లోపలినుంచి వినవస్తున్న మాటలు విన్నాడు.

"ఇంట్లో నేను ఒక్కతెనే ఉండాలి! అసలే వర్షం వచ్చేలా ఉన్నది. ఇప్పుడు ఈ చీకట్లో జూదం ఆడటానికి వెళ్ళక పోతేనేం?" అంటున్నది ఒక స్త్రీ.

"నాకు నిద్ర రావడంలేదు. కాల క్షేపం కావాలి!" అంటున్నాడు మగవాడు.



వాళ్ళిద్దరూ భార్యాభర్తలని గజపతికి అర్థమయింది. భార్య ఎంత బతిమాలినా వినక, భర్త, ''త్వరగా వచ్చేస్తానులే! తలుపు దగ్గిరగా వేసి ఉంచు. నీది అసలే మొద్దునిద్ర! ఎంతసేపు బాదినా తలుపు తీయవు. లోపల గడియ పెట్ట వద్దు!'' అంటూ బయటికి వచ్చాడు.

అతడికి కనబడకుండా గజపతి స్తంభం చాటుకు తప్పుకున్నాడు.

అతను వెళ్ళిన కాస్సేపటికి వర్షం అరంభమయింది. జూద మాడబోయిన వాడు ఆ వర్షంలో ఇంతట్లో తిరిగి రాడు. ఇంటి ఇల్లాలు నిద్రపోయి వుంటుందని రూఢి పరచుకున్నాక, గజపతి పిల్లిలా ఆ ఇంటిలో ప్రవేశించి, దొరికిన వెండి సామానూ, డబ్బూ మూట గట్టుకుని, నిశ్శబ్దంగా ఇవతలికి వచ్చి, ఆ ఊరు వదిలేశాడు.

''ఆ ఇంటి మనిషికి కాలక్షేపం కావలసి రావడం నా పాలిటి వరమయింది. అయితే ఆ మూట ఇప్పుడు నా దగ్గిర లేదు. చలపతి దాన్ని కిటికీ పైన గూడులో దాచటం నేను చూడక పోలేదు!'' అంటూ గజపతి నవ్వుతూ పోయి, తన డబ్బు మూటను తాను తీసేసుకున్నాడు.

ముగ్గురూ ఎవరి మూటలు వాళ్ళు తీసేసుకుని, ''ముగ్గురమూ ఒకరికొకరం ఎందులోనూ తీసిపోము!'' అని గట్టిగా నవ్వుకున్నారు.

ఇంతలో ఆ గది తలుపు దభాల్న మూసుకున్నది.

సత్రం అధికారి కిటికీలో నుంచి చూస్తూ, ''మీరు మీ గురించి చెప్పుకుంటూ, చక్కగా చేసిన కాలక్షేపంతో మీ ఆటలు కట్టాయి. నేను మీ కథలన్నీ విన్నాను. మీరు దొంగసరుకుతో సహా దొరికిపోయారు! తెల్లవారే దాకా ఎలాగో కాలక్షేపం చెయ్యండి. తిన్నగా బోలెడు పని ఉండే చెరసాలకు పోదురుగాని!'' అంటూ గది తలుపులకు బయటనుండి పెద్ద తాళం పెట్టాడు





# అంతా చుట్టాలే!

రామకోటికి పట్నంలో ఉద్యోగం దొరకడం అతని తల్లి శాంతమ్మకూ, తమ్ముడు సూర్యానికీ, చెల్లెలు కమలకూ ఎంతో ఆనందం కలిగించింది. భర్త పోయినాక శాంతమ్మ తన ముగ్గురు పిల్లలనూ వంటలక్కగా పని చేసి పోషించింది. స్వతహాగా మంచి తెలివి తేటలు గల రామకోటి వారాలు ఛేసుకుని చదువుకున్నాడు. అతనికి అప్పారావుగారింట వారానికి రెండు రోజులు భోజనం పెట్టేవారు. అప్పారావు తాను ఇంత తిని, ఇతరులకు ఇంత పెట్టగలిగినా, గొప్ప స్థితిపరుడు కాడు.

చదువులో బాగా రాణించడం వల్ల రామకోటికి పట్నంలో ఉద్యోగం సులువుగా దొరికింది. అతను తన తల్లినీ, తోబుట్టువులనూ తనతో బాటు పట్నం తీసుకు పోదామనుకున్నాడు గాని, పట్నంలో ఖర్చు ఎక్కువని శాంతమ్మ అందుకు ఒప్పుకోలేదు. అందుచేత రామకోటి తన సంపాదనలో తనకు అవసరమైనదిమాత్రం ఉంచుకుని మిగిలినదంతా తల్లికి ఇస్తూండేవాడు. దానితో ఆమె ఇంటికి కావలసిన హంగులన్నీ సమకూర్చుకుని, తన కొడుకు హోదాకు తగ్గట్టుగా ఇల్లు తీర్చి దిద్దింది. కొడుకు పోరగా పోరగా, ఆమె వంటలక్క పని మానేసింది. సూర్యం ఏదో వృత్తివిద్య నేర్చుకోసాగాడు. కమల కుట్టుపనీ, సంగీతమూ నేర్చుకోసాగింది.

రామకోటి ప్రతి వారమూ ఇంటికి వచ్చేవాడు. ఒకసారి ఇలాగే అతను పట్నం నుంచి ఇంటికి వచ్చేసరికి, ఎవరో ధనికురాలు ఇంట్లో కనిపించింది. శాంతమ్మ రామకోటికి ఆవిడను పరిచయం చేస్తూ, ''కోటీ, ఈవిడ మీ నాన్నగారికి

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

అక్క అవుతుంది. తన కూతుర్ని నీకు ఇస్తామని అడగటానికి వచ్చింది.'' అన్నది గొప్పగా.

ఆ రాత్రి రామకోటి తన తల్లితో, ''ఇన్నాళ్ళూ మనం ఎరగని ఈ బంధువు నాకు పిల్లనిస్తానని వచ్చిందంటే, అది మనమీది అభిమానంతో కాదు. నన్ను సొంతం చేసుకుని మీ నుండి వేరు చేద్దామనే! నాకు ఈ సంబంధం వద్దు!'' అన్నాడు, ఆ చుట్టానికి వినిపించేలాగే.

తెల్లవారగానే ఆ చుట్టం వెళ్ళిపోయింది.

వారం తిరిగి రామకోటి మళ్ళీ పట్నం నుంచి వచ్చేసరికి, ఎవరో ఒకతను కుర్చీలో కూర్చుని పత్రిక చూస్తున్నాడు. అవతారంచూస్తే మోతుబరిలా వున్నాడు. అతను రామకోటిని చూసి, ''ఏమోయ్, ఇదేనా రావడం?'' అని పలకరించాడు.

ఇంతలో శాంతమ్మ లోపలి నుంచి వచ్చి, ''కోటీ, ఇతను నా పినతల్లి కొడుకు నాగభూషణం, తన కూతుర్ని నీకిస్తానని వచ్చాడు.'' అని రామకోటికి పరిచయం చేసింది.

రామకోటి తల్లితో, "అమ్మా, ఇప్పుడప్పుడే నేను పెళ్ళి చేసుకోదలచలేదు. ముందు కమల పెళ్ళి కావాలి,'' అని, నాగభూషణంతో, ''నాగభూషణంగారూ, ఈ రూపంగానైనా ఇన్నేళ్ళయాక మేం మీకు కనిపించాం! నాలుగు రోజులుండి మరీ వెళ్ళండి.'' అన్నాడు.



'' అబ్బే, ఎంతమాట! నేను ఎప్పటి కప్పుడు ఒక మారు వచ్చి మిమ్మల్ని చూద్దామను కుంటూనే ఉన్నాను. కాని తీరిక దొరకలేదు. నాకు పట్నంలో తొందర పని ఉన్నది. మళ్ళీ కలుద్దాం! వెళ్ళివస్తాను,'' అంటూ నాగభూషణం లేచి, వెళ్ళిపోయాడు.

మాఘమాసంలో, శాంతమ్మ చెల్లెలి కూతురు పెళ్ళి అయితే అంతా వెళ్ళారు. పెళ్ళినాటి రాత్రి శాంతమ్మా, పిల్లలూ ఒక చోట పడుకున్నారు. రామకోటికి నిద్ర పట్టలేదు. అర్ధరాత్రి వేళ అతనికి ఒక సంభాషణ వినిపించింది. అతను తల్లిని తట్టి లేపి, మాట్లాడ వద్దని సంజ్ఞ చేశాడు.

" మన అమ్మాయి సంబంధం గురించి శాంతమ్మతో కదపలేదేం? '' అని ఒక ఆడగొంతు అడుగుతున్నది.

''ఆ వంటపుట్టి దానితో సంబంధమా ?'' అని మగ గొంతు అన్నది.

''ఆ అబ్బాయి నిక్షేపంలా ఉన్నాడు! పట్నంలో నౌకరీ! బాగా సంపాదిస్తున్నాడుట! మన అమ్మాయినిచ్చినాక అది వాడి చేత ఎలాగూ వేరు కాపరం పెట్టిస్తుంది....'' అన్నది ఆడగొంతు.

ఆ తరవాత శాంతమ్మ దగ్గర ఎవరు రామకోటి పెళ్ళి ప్రస్తావన తెచ్చినా, ''మా వాడికి ఇప్పట్లో పెళ్ళి చెయ్య దలచుకో లేదు లెండి,'' అని ఆమె అన సాగింది.



ఒకసారి రామకోటి పట్నం నుంచి వస్తూనే, ''అమ్మా, అప్పారావుగారు కమలకు మంచి సంబంధం తెచ్చారు. అబ్బాయి చాలా బుద్ధిమంతుడు. పిన్ని గారింట పెళ్ళిలో అతను కమలను చూశాడట. పెళ్ళి వీలయినంత తక్కువ ఖర్చులో జరపమని వాళ్ళే అంటున్నారట. పెళ్ళిఖర్చులకు మన దగ్గర డబ్బు లేకపోతే అప్పారావుగారు సర్దుతామంటున్నారు!'' అన్నాడు.

''ఆ అప్పారావుగారికి ఎంత ఋణపడి ఉన్నాంరా! వారి చలవవల్లనే నువ్వింత వాడివయావు!'' అన్నది శాంతమ్మ.

''అవునమ్మా! అప్పారావుగారి అమ్మాయి సీతను నేను చేసుకుంటే ఆ ఋణం కొంతన్నా తీరుతుందేమో!'' అన్నాడు రామకోటి.

సీతకు చిన్నతనంలో బాలపక్షవాతం వచ్చి కుంటిది అయిపోయింది. అయితే నేం? ఎంతో బుద్ధిమంతురాలు! ఇంటి పనులన్నీ చక్కగా చేస్తుంది!

కొడుకు నిర్ణయానికి శాంతమ్మ చాలా సంతోషించింది. ఆమె అప్పారావుగారింటికి వెళ్ళి, ఆయనతో తన కొడుకు నిర్ణయం చెప్పింది.

''కుర్రతనం వల్ల కోటి తొందర పడుతున్నాడేమో! కొంచెం ఆలోచించుకోమనండి,'' అన్నాడు అప్పారావుగారు శాంతమ్మతో.

''అన్నగారూ, మా చుట్టాలలో చాలా మంది వాడికి పిల్లలనిస్తామని వచ్చారు. తాను కాస్త మంచి స్థితిలో ఉండటం చూసి వచ్చే చుట్టాలంటే వాడికి చాలా మంట. వాడి ఉద్దేశంలో మీ లాగా అడుగడుగునా ఆదుకునే వారే అసలు చుట్టాలు. వాడు బాగా ఆలోచించే సీతను చేసుకుంటున్నాడు. మీరు ఒప్పేసుకోండి!'' అన్నది శాంతమ్మ.

ఒక శుభముహూర్తాన రామకోటికీ, సీతకూ పెళ్ళి జరిగిపోయింది. ఈ పెళ్ళికి ముందే కమల పెళ్ళికూడా జరిగిపోయింది.





# చిన్నశెట్టి శిష్యుడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని ఏలుతుండగా బోధిసత్వుడు శ్రేష్ఠికులంలో పుట్టి, "చిన్నశెట్టి" అని పిలవబడ్డాడు. ఆయన బుద్ధిమంతుడూ, శకునశాస్త్రం తెలిసిన వాడూనూ.

ఒకనాడు చిన్నశెట్టి రాజసభకు వెళుతూ, ఒక చచ్చిన ఎలుకను చూసి, "ఒక తెలివి గల యువకుడు ఈ చచ్చిన ఎలుకతో వ్యాపారం ప్రారంభించి, పెళ్ళి చేసుకోవచ్చును," అన్నాడు.

ఈ మాటలు ఒక యువకుడి చెవుల పడ్డాయి. అతను మంచి కుటుంబంలో పుట్టినవాడే, కాని చాలా పేదవాడు.

ఆ యువకుడు చచ్చిన ఎలుకను తీసుకుపోయి, పిల్లికి ఆహారం కింద ఒక కానీకి ఏదో దుకాణంలో అమ్మాడు.

అతను ఆ కానీకి బెల్లంగడ్డ కొని, ఒక కుండెడు మంచినీళ్ళు కూడా తీసుకుని, అడవికి వెళ్ళే మార్గంలో కూర్చున్నాడు. అడవినుంచి పూలుతెచ్చే మాలాకారులకు అతను కొంచెం కొంచెం బెల్లం పెట్టి, తాగటానికి నీరు ఇచ్చి, వారి వద్ద నుంచి గుప్పెడు, గుప్పెడు పూలు పుచ్చుకున్నాడు. తరవాత అతను ఆ పూలు అమ్మి డబ్బుచేసుకున్నాడు.

మర్నాడు అతను మరింత ఎక్కువ బెల్లం తీసుకుని, మంచి నీటితో మళ్ళీ అదే చోటికివెళ్ళి కూర్చున్నాడు. ఈ రోజు అతనికి మాలాకారులు పూలమొక్కలు కూడా ఇచ్చారు. ఇలా అతను చాలా కొద్దిరోజులలోనే ఎనిమిది కార్షాపణాలు (వెండి నాణాలు) సంపాదించాడు.

ఒక నాడు గాలివాన వచ్చింది. రాజోద్యానంలో ఎండు కొమ్మలూ, ఆకులూ అమితంగా గాలికి రాలిపడ్డాయి. తోటమాలి ఉద్యానాన్ని ఎలా శుభ్రం చేయ



టమా అని ఆలోచిస్తూండగా, యువకుడు అక్కడికి వెళ్ళి, రాలిన కర్రలూ, కంపా తనకు ఇచ్చే పక్షంలో ఉద్యానాన్ని తాను బాగుచేస్తా నన్నాడు. తోటమాలి వెంటనే ఒప్పుకున్నాడు.

అప్పుడా యువకుడు పిల్లలు ఆడు కుంటున్న చోటికి పోయి, అందరికీ తలా కాస్తా బెల్లంపెట్టి, వాళ్ళను ఉద్యానానికి తీసుకుపోయి, వాళ్లచేత ఉద్యానంలో రాలి పడిన కర్రలూ, కంపా పోగుచేయించి, ఉద్యానద్వారం వద్ద చేర్పించాడు.

ఆ సమయంలో రాజుగారి కుమ్మరి అటుగా వచ్చి, ఉద్యానద్వారం వద్ద వున్న కుప్పను కుండలు కాల్చటానికి బేరం చేశాడు. ఈ బేరంలో యువకుడికి ఇరవైఆరు కార్షాపణాలూ, కొసరు కింద కొన్ని చట్లూ లభించాయి.

ఇలా ముఫైనాలుగు కార్షాపణాలు సంపాదించిన మీదట అతనికొక ఆలోచన వచ్చింది. అతను నగరద్వారానికి సమీపంలో ఉన్న చలివేంద్రానికి వెళ్ళి, అయిదు వందల మంది గడ్డికోసుకునే వాళ్ళకు తాగటానికి నీరు అందించాడు. వాళ్ళు కోరిన సహాయం చేస్తామన్నారు.

తరవాత ఒకనాడు, ఆ యువకుడికి తెలిసిన ఒక వర్తకుడి ద్వారా, మర్నాడు ఆ నగరానికి ఒక గుర్రాల వర్తకుడు అయిదు వందల గుర్రాలతో రానున్నట్టు తెలిసింది. వెంటనే ఆ యువకుడు గడ్డి మోపుల వాళ్ళను కలుసుకుని, "రేపు మీరంతా నాకు తలా ఒక గడ్డిమోపు ఇయ్యాలి. నా మోపులు అమ్ముడయే దాకా మీరు ఎక్కడా గడ్డి అమ్మవద్దు!" అన్నాడు. వాళ్ళు అలాగేనని, అయిదు వందల గడ్డిమోపులు తెచ్చి, అతని ఇంటి దగ్గర పడేశారు.

అనుకున్న ప్రకారం గుర్రాల వర్తకుడు అయిదు వందల గుర్రాలతో వచ్చాడు. వాటికి కావలసిన గడ్డి ఇంకెక్కడా దొరకక పోవటం చేత, యువకుడి దగ్గర అయిదు వందల గడ్డి

మోపులూ కొని, అతనికి వెయ్యి నాణాలు ఇచ్చాడు.

మరికొంత కాలానికి యువకుడు తనకు పరిచయం వున్న ఒక నౌకావ్యాపారి ద్వారా, ఒక పెద్ద నావ రేవులోకి వచ్చినట్టు విని, ఒక మంచి ఆలోచన చేశాడు. ఆ ఆలోచన ప్రకారం అతను ఉత్తమమైన బండిని ఎనిమిది కార్షాపణాలకు బాడుగకు తీసుకుని, దానితో రేవుకు వెళ్ళాడు. అతను ఒక ఉంగరాన్ని బయానా కింద ఇచ్చి, నావను కొన్నాడు. తరవాత ముగ్గురు ప్రతీహారులను నియమించి, వర్తకులెవరైనా వస్తే తన వద్దకు తీసుకు రమ్మన్నాడు.

ఈ లోపల నావ రేవులోకి వచ్చినట్టు తెలిసి, కాశీనగరంలోని నూరుమంది వర్తకులు సరుకులు కొనుక్కుందామని వచ్చారు. అప్పటికే సరుకంతా ఎవరో యువకుడు కొనేసినట్టు వారికి తెలిసింది. వర్తకులు ఆ యువకుడి వద్దకు వచ్చారు. యువకుడు వారికి నావలోని సరుకుతో బాటు, జాగా కూడా రెండేసి వేలకు అమ్మి, రెండు లక్షలు సంపాదించాడు.

తరవాత ఆ యువకుడు చిన్నశెట్టి వద్దకు వెళ్ళి, ఆయనకు లక్ష నాణాలు చూపాడు. "నాయనా, నీకు ఈ డబ్బంతా ఎలా వచ్చింది?" అని చిన్నశెట్టి అడిగాడు.

"తమ ఉపదేశం మూలంగా, నాలుగు మాసాల కాలంలో ఈ డబ్బు సంపాదించాను!" అంటూ ఆ యువకుడు తాను చచ్చిన ఎలుకను కానీకి అమ్మినది మొదలుకుని, అంతా చెప్పాడు.

అంతా విని చిన్నశెట్టి, "ఇటువంటి కుర్రవాణ్ణి ఇతరుల చేతిలో పడనియ్యరాదు!" అనుకుని, పెళ్ళికి సిద్ధంగా వున్న తన కూతుర్ని ఆ కుర్రవాడికిచ్చి పెళ్ళిచేసి, తనకున్న ఆస్తి అంతా అతని పరం చేశాడు. చిన్నశెట్టి చనిపోయిన తరవాత ఆ యువకుడికి "శ్రేష్ఠి" పదవివచ్చింది.





# అదృశ్య బుద్ధుడు

బుద్ధుడి జ్ఞాతి అయిన దేవదత్తుడు, బుద్ధుడి శిష్యుడుగా నటిస్తూనే బుద్ధుణ్ణి చూసి అసూయపడే వాడు. మగధ రాజకుమారుడు అజాతశత్రువూ, దేవదత్తుడూ స్నేహితులు. అజాతశత్రువు తన తండ్రి అయిన బింబిసారుణ్ణి చంపటానికి దేవదత్తుడు ప్రోత్సాహమిచ్చాడు. అజాతశత్రువు రాజు అయాక తనకు ఉన్నతి వస్తుందని అతని ఆశ.

దేవదత్తుడి ప్రోత్సాహంతో అజాతశత్రుడు ఒకరోజు అవకాశం చూసుకుని బింబిసారుడి శయనమందిరాన్ని రహస్యంగా ప్రవేశించి, నిద్రలో వున్న రాజును సమీపించి, చురకత్తి పైకి తీసి రాజును పొడిచి చంపబోయాడు.





కాకతాళీయంగా రాజసేవకుడు గదిలోకి రావటం జరిగింది. వాడు గట్టిగా అరిచాడు. అజాతశత్రు చేతి కత్తి జారి కింద పడింది. రాజుగారి అంగరక్షకులు పరిగెత్తుకుంటూ వచ్చారు. అజాతశత్రువు తేలికగా పట్టుబడ్డాడు.



ఈ దుష్కార్యానికి తనను ప్రేరేపించిన వాడు దేవదత్తుడు అని అజాతశత్రు ఒప్పుకొన్నాడు. అజాతశత్రుకు శిక్ష పడాలని మంత్రులు అన్నారు. కాని రాజు, "నేను వృద్ధుణ్ణి, నన్ను విరమించ నియ్యండి. నా కొడుకు రాజు అయాక, అతడికి ఆత్మవిశ్వాసం కుదురుతుంది. దుష్టులు అతన్ని ప్రేరేపించ లేరు!" అన్నాడు.

అజాతశత్రు తండ్రి కాళ్ళమీద పడి, ఆయన పెట్టిన క్షమాభిక్షకు అర్హుడుగా నడుచుకుంటా నన్నాడు. బింబిసారుడు రాజ్యాన్ని కొడుక్కు ఇచ్చేశాడు. అజాతశత్రువు ఆటు తరవాత దేవదత్తుణ్ణి కాదని, బుద్ధుడి బోధలు వినసాగాడు. అతను బౌద్ధ, జైనమతాలు రెంటిని ఆదరించాడు.





అజాతశత్రుడిలో కలిగిన హృదయ పరివర్తన చూసి ఆశాభంగం చెంది, తానే స్వయంగా బుద్ధుణ్ణి చంపటానికి దేవదత్తుడు తీర్మానించు కున్నాడు. బుద్ధుడు సాయం సంధ్యలలో ఒక కొండ దిగువన పచార్లు చేసేవాడు. ఒక రోజు దేవదత్తుడు కొండ మీది నుంచి బుద్ధుడి మీదికి ఒక పెద్ద కొండ శిలను దొర్లించాడు.

అదే సమయంలో మరొక శిల దానం తట అదే కిందికి దొర్లుతూ, మధ్య దారిలో మొదటి శిలను ఒక వైపునుంచి ఢీకొని, దాని మార్గాన్ని మార్చింది. రెండు శిలలూ బుద్ధుడికి కొన్ని గజాల దూరంలో పడ్డాయి. బుద్ధుడికి అపాయం తప్పిందిగాని, అతని పాదంలో రాయి గుచ్చుకున్నది.





తరవాత దేవదత్తుడు నీలగిరి అనే ఏనుగును సాకే మావటి వాడితో కుట్ర చేశారు. ఆ ఏనుగుకు మనుషులను తొక్కి చంపే దురలవాటు ఉన్నది. వాళ్ళు నీలగిరి చేత మత్తుపానీయం బాగా తాగించారు. బుద్ధుడు వీధిలోకి వచ్చే ముందే వాళ్ళు ఈ పని చేశారు.

బాగా కైపెక్కిన మీదట నీలగిరిని వీధిలోకి వదిలారు. దాన్ని చూసి వీధిలో జనం చెల్లా చెదరై పారిపోయారు. బుద్ధుడు తన శిష్యులతో వీధి వెంట వస్తున్నాడు. శిష్యులు బుద్ధుణ్ణి రక్షించటానికి ముందుకు రాబోయారు. కాని బుద్ధుడు వారిని వెనక్కు నెట్టి, తానే ముందుకు వచ్చాడు.





ఆ గందరగోళంలో ఒక తల్లి చంక నుంచి బిడ్డ పడిపోయింది. ఏనుగు దాన్ని సమీపించింది. పారిపోతున్న జనం నిలగిరి కాళ్ళకింద బిడ్డ చచ్చి పోతున్నదని అరిచారు.

బుద్ధుడు వేగంగా నడుస్తూ వచ్చి, బిడ్డ ముందు నిలబడ్డాడు. అదే క్షణంలో ఏనుగు కూడా అక్కడికి వచ్చింది. దుష్టస్వభావం గల ఏనుగు బుద్ధుడికీ, బిడ్డకూ కూడా కీడు చేస్తుం దని అందరూ అనుకున్నారు. కాని, చిత్రంగా ఏనుగు నిలిచిపోయింది.





బుద్ధుడు ఏనుగుతో, "నీలగిరీ, శాంతించు, సౌమ్యంగా మంచిదానివి గాకా!" అన్నాడు. ఏనుగు నింపాదిగా బుద్ధుడిముందు మోకరించి, ఆశీర్వాదం కోరుతున్నట్టు కనబడింది. బుద్ధుడు దాన్ని నిమిరాడు. ప్రజలు ఇలాటి అనుభవం ఎరగరు. బుద్ధుడు ఎంత మహా పురుషుడో వారికి తెలిసివచ్చింది.

# ఖరీదైన మోసగాడు

సుబ్బిశెట్టి లక్షాధికారి, కాని లోభి. ముఖ్యంగా కూలీ నాలీ చేసుకునే వాళ్ళకు న్యాయంగా ఇయ్యవలసినది ఇయ్యాలన్నా శెట్టికి ప్రాణం కడబట్టినంత పని అయేది.

ఒక రోజల్లా నారయ్య శెట్టి ఇంటి పనీ, పెరటి పనీ చేసి, వెళ్ళిపోతూ కూలి డబ్బు అడిగాడు. అయిదు రూపాయల కాగితం ఉన్నది గాని చిల్లర లేదనీ, నారయ్య దగ్గిర రూపాయి ఉంటే అది ఇచ్చి అయిదు రూపాయలు తీసుకోమనీ అన్నాడు శెట్టి.

తన దగ్గిర చిల్లిగవ్వ లేదన్నాడు నారయ్య. అయితే రేపు రమ్మన్నాడు శెట్టి. డబ్బు తీసుకోకపోతే ఆ రాత్రి పొయిలో పిల్లి లేవదనీ, తనకు అందరూ అయిదు రూపాయల రోజు కూలి ఇస్తున్నారనీ నారయ్య అన్నాడు. శెట్టి నాలుగు రూపాయల పైన చచ్చి గీ పెట్టినా ఇచ్చేది లేదు' అన్నాడు.

ఇంతలో పేరిశెట్టి కొడుకు వీరభద్రం వచ్చాడు. పేరిశెట్టి కోటీశ్వరుడు. శెట్టి అతన్ని అయిదు రూపాయలకు చిల్లర అడిగాడు. నాలుగు రూపాయలే ఉన్నాయనీ, ఇంకో రూపాయి మర్నాడు ఇస్తాననీ వీరభద్రం అన్నాడు. శెట్టి ఆ నాలుగు రూపాయలూ నారయ్యకు ఇచ్చి పంపాడు. వీరభద్రం రూపాయి శెట్టికి ఇయ్యనే లేదు. దాన్ని ఎలా వసూలు చేసుకోవాలో సుబ్బిశెట్టికి తెలియలేదు. వీరభద్రం తండ్రి కోటీశ్వరుడాయె!

"ఆ రూపాయి నారయ్యనే తిననిచ్చాను గాను!" అని సుబ్బిశెట్టి అప్పుడప్పుడూ పశ్చాత్తాప పడేవాడు.

—వక్కలంక రామారావు

43





# ఇరుగు-పొరుగు

శంకరుడూ, కేశవుడూ చిన్ననాటి నుంచీ మంచి స్నేహితులు. ఇద్దరూ విద్యాభ్యాసం ముగించి, రాజధానిలో ఉద్యోగాలు సంపాదించి అక్కడ ఇళ్ళు బాడుగకు తీసుకుని, వాటిలో కాపరాలు చేస్తున్నారు. అయితే ఇద్దరి ఇళ్ళూ ఒక ప్రాంతంలో లేవు.

శంకరుడు ముక్కుకు సూటిగా పోయే రకం. కేశవుడు లౌక్యం తెలిసినవాడు. శంకరుడు ఇతరులతో కలవలేకపోయేవాడు. కాని కేశవుడికి ఎవరితో ఎలా ప్రవర్తించి, ఇతరులకు కష్టం కలగకుండా మసలుకోవాలో బాగా తెలుసు.

శంకరుడు ఉంటున్న ప్రాంతంలో అందరూ గొప్పగా బతుకుతున్నామనుకుంటున్నవాళ్ళు. వాళ్ళు అస్తమానమూ శంకరుడి దగ్గిర తమ గొప్పలు చెప్పుకునే వాళ్ళు. శంకరుడికి అది చాలా చిరాకుగా ఉండేది. వాళ్ళ భార్యలు కూడా అదే రకం మనుషులు. వాళ్ళను శంకరుడి భార్య సహించలేకపోయేది. ఈ కారణంగా శంకరుణ్ణీ, అతని భార్యనూ ఇరుగు పొరుగువాళ్ళు అంత ఆప్యాయంగా చూసేవారు కారు. చిన్న చిన్న కీచులాటలు కూడా కలుగుతూండేవి. ఇరుగు పొరుగు వాళ్ళతో వేగలేక అన్ని సౌకర్యాలూ ఉన్న ఇంటిని వదిలిపెట్టి వేరే ఇల్లు చూసుకోవడమంటే శంకరుడికి కొంచెం బాధగానే ఉండేది.

ఒకసారి శంకరుడు తాను ఇరుగు పొరుగు వాళ్ళతో పడలేకుండా ఉన్న సంగతి కేశవుడికి చెప్పుకున్నాడు.

కేశవుడు అంతా విని, నవ్వి, "ఇందులో నువు బాధపడవలసినదేమీలేదే! నీ పొరుగు వాళ్ళు నీతో చాలా బాగా ప్రవర్తిస్తున్నారనాలి. వాళ్ళతో నెగ్గుకు రావటం

బొమ్మిడి అచ్చారావు

చాలా తేలిక. కొద్ది రోజులపాటు మనం ఇళ్ళు మార్చుకుందాం,'' అన్నాడు.

సౌకర్యాలు తక్కువైనా కేశవుడుంటున్న చోట ఇరుగూ, పొరుగూ మంచివాళ్ళయి ఉండాలి. అతను వాళ్ళనుగురించి ఎన్నడూ చెడుగా చెప్పలేదు. అందుచేత శంకరుడు తన స్నేహితుడితో ఇళ్ళు మార్చుకోవటానికి సిద్ధపడ్డాడు.

ఇద్దరూ ఇళ్లు మారారు.

శంకరుడు కేశవుడి ఇంటికి మారి వారం తిరగకుండానే, తాను విడిచి వచ్చిన ఇంటి పొరుగే ఎంతో మంచి దనిపించింది. ఆ ప్రాంతంలో అందరూ చాలీచాలని రాబడిగల కుటుంబాలవాళ్లు. చుట్టుపక్కల ఇళ్ళ పిల్లలు అస్తమానమూ శంకరుడి ఇల్లు పట్టుకుని వేళ్ళాడేవాళ్లు; శంకరుడి పిల్లల చేతిలో తినేది ఏమన్నా ఉంటే లాగేసుకుని తినేవాళ్ళు. అమ్మ లక్కలు శంకరుడి భార్య వద్దకు ప్రతి దానికీ అరువుకు వచ్చేవాళ్ళు. అప్పు తీసుకున్నది ఎన్నడూ తిరిగి ఇచ్చేవారు కారు. అలాగే శంకరుడి దగ్గిర చుట్టు పక్కల వాళ్లు తీసుకున్న చేబదుళ్ళు తిరిగి వచ్చేవి కావు.

చూసి, చూసి శంకరుడూ, అతని భార్యా అప్పులు ఇయ్యటం మానేశారు. వెంటనే ఇరుగు పొరుగు వాళ్ళందరూ శత్రువులయిపోయారు. ఈ శత్రుత్వం శంకరుడి పిల్లలకూ, పొరుగు పిల్లలకూ మధ్య కూడా ఏర్పడింది. పిల్లల కొట్లాటలు



పెద్దవాళ్ళ కక్షలకు దోహదంగా ఉండేవి. శంకరుడికి జీవితం నరకప్రాయ మనిపించింది.

అతను కేశవుణ్ణి కలుసుకుని తన కొత్త కష్టాలన్నీ ఏకరువు పెట్టాడు. కాని తనతో ముభావంగా ఉన్న ఇరుగు పొరుగు వాళ్లు కేశవుడితో సరదాగా కబుర్లు చెబుతూండటం గమనించి, ఆశ్చర్యపోయాడు.

అందరూ వెళ్ళిపోయాక కేశవుడు శంకరుడితో ఇలా అన్నాడు: "శంకరా, నీకు లౌక్యం బొత్తిగా తెలీదు. ఇరుగు పొరుగుతో సఖ్యంగా ఉండటం ఒక కళ, అయినా ఆచరణలో ఏమంత కష్టం కాదు. నువు ఇక్కడి జనంతో వేగలేక నా యింటికి పారిపోయావు. కాని, నేను చూడు, వాళ్ళను ఎలా ఆకర్షిస్తున్నానో! వీళ్ళు తమ గొప్పలు చెప్పుకుంటారు, తాము చెప్పేదే నిజమనుకుంటారు. నేను అభ్యంతరం చెప్పను. అందువల్ల వాళ్లకు నా మీద గురి ఏర్పడుతుంది. ఒకసారి నాలో వాళ్ళకు గురి కుదిరినాక వాళ్ళ తప్పును వాళ్లే ఒప్పుకునేటట్టు సున్నితమైన మార్గాలు చూడవచ్చు. వాళ్ల అతిశయంవల్ల నాకు నష్టం ఏమీలేదు. తమ గొప్పతనం చాటుకోవటానికి నా పిల్లలకు కానుకలిస్తారు, నాకు సహాయపడతారు. నా భార్య కూడా చుట్టుపక్కల ఉండే అమ్మలక్కలను మచ్చిక చేసుకున్నది. వాళ్లకు సంతోషం కలిగించటంలో మనకు పోయేదేమిటి? ఏ అవసరం వచ్చినా ఇరుగు పొరుగు ఎలా ఆదుకుంటారో నీకు జన్మలో ఎన్నడూ అనుభవంలేదు గద!

"ఇప్పుడు నీ పొరుగు సంగతి తీసుకో. నువు అక్కడి వాళ్ల సంగతి మొదట్లోనే గ్రహించి ఉంటే, వాళ్లకు చేబదుళ్ళు అవి ఇచ్చి ఉండవు. ఎదురు వాళ్ళనే బదుళ్లు అడిగిఉందువు. ముందు ఇచ్చి తరవాత బదుళ్ళు ఇయ్యనిరాకరించి వాళ్ళ శత్రుత్వం కొని తెచ్చుకున్నావు. ఇరుగు పొరుగును అర్థం చేసుకోనిదే వారిని మంచి చేసుకోలేం. అందులోనే ఉన్నది వివేకం!"



# కంచె – కలుపు

ఒక రాజుకు రెండు సమస్యలు ఒకేసారి కలిగాయి: పాతకాలపు కోట గోడ శిథిలమవుతున్నది, దాన్ని పునర్నిర్మించాలి; దేశంలో దొంగల బెడద హెచ్చుతున్నది, దాన్ని అరికట్టాలి. ముందు ఏది చెయ్యాలా అని ఆలోచిస్తూ, మారువేషంలో తిరుగుతూ రాజు గోధూళివేళ ఒక పొలం వద్దకు వచ్చాడు.

ఆ పొలంలో పంటా, కలుపూ కలగూరగంపలా కలిసిపోయి ఉన్నాయి. రైతు దాన్ని పట్టించుకోక, చేనుకు శ్రద్ధగా కంచె వేస్తున్నాడు.

"ఇంకా కలుపు తీయక కంచె వేస్తున్నావేం?" అని రాజు రైతును ప్రశ్నించాడు.

రైతు రాజు కేసి ఎగా, దిగా చూసి, "కలుపు వంటింటి కుందేలు. అదెక్కడికి పోతుంది? కంచె వేయకపోతే మొదటికే మోసం రాదా?" అన్నాడు రైతు నవ్వి.

రాజు సమస్య తీరిపోయింది. మర్నాడే కోటగోడ నిర్మాణం ప్రారంభమయింది.

—టి. వి. యస్. అరుణ్‌మూర్తి

47






# రాజ్యాన్వేషణ

మాళ్వదేశంలో ఒకప్పుడు సుదర్శను డనే యువకుడుండేవాడు. వాడు చూపులకు నవమన్మథుడే, కాని అతి బీద వాడు. వాడు చిన్నతనమంతా కాశీ నగరంలో ఉండి చక్కగా చదువుకుని, చదువు పూర్తి అయాక స్వదేశానికి బయలుదేరాడు.

అక్కడక్కడ మజిలీలు చేసుకుంటూ సుదర్శనుడు ఒక రాత్రికి పురందర మనే చిన్న రాజ్యం చేరాడు. నగరం ప్రవేశించే సరికి బాగా చీకటి పడింది. ఆ చీకటిలో పడి మరొక చోటికీ, మరొక చోటికీ వెళ్ళడం దేనికని, అతను నేరుగా రాజు గారి ఇంటికి వెళ్ళి, "మహారాజా, నేను పరదేశిని, అభ్యాగతిని. ఈ పూటకు భోజనమూ, శయనమూ చూపారంటే రేపు ఉదయం నా తోవన నేను వెళ్ళిపోతాను," అన్నాడు.

పురందరరాజు అతని అందచందాలకూ, అతని ధైర్యానికీ ముచ్చటపడి సరే నన్నాడు. సుదర్శనుడు స్నానానికి వెళ్ళగానే రాణి తన భర్తతో, "చూడండీ, ఈ కుర్రవాడు మామూలు దుస్తులు ధరించాడన్న మాటే గాని, నాకు చూడగా మారువేషంలో తిరుగుతూన్న ఏ చక్రవర్తి కుమారుడో అనిపిస్తోంది. అతని విషయం విచారించండి. అనుకూలిస్తే అమ్మాయి నిచ్చి చేద్దాం," అన్నది.

"మారువేషంలో తిరుగుతున్న వాడు మనం అడిగితే నిజం చెబుతాడా? మంత్రి నడిగి ఏదో ఒకటి చేద్దాం!" అన్నాడు రాజు.

మంత్రి సంగతి సందర్భాలన్నీ తెలుసుకుని, "దానికేం భాగ్యం? కుర్రవాడు రాజవునో కాదో కనుక్కోవచ్చు. కాని ఒక్క రాత్రిలో తేలదు. అందుచేత

అతన్ని కనీసం రెండు రోజులైనా నిలిపి ఉంచండి,'' అన్నాడు.

భోజనాల సమయంలో రాజు సుదర్శనుడితో, ''అబ్బాయీ, నువు రేపు ఉదయమే వెళ్ళిపోతానని అన్నావు. అలా వెళ్ళటానికి వీలులేదు. రేపు మా అమ్మాయి ఇందుమతి పుట్టినరోజు. రేపు కూడా ఇక్కడే ఉండిపో. ఎల్లుండి నీ దారిన పోవచ్చు!'' అన్నాడు.

ఈ లోపుగా మంత్రి సుదర్శనుడి కోసం ఒక గదిలో మామూలు పక్క ఒకటి వేయించాడు. ఆయన పహరా వాణ్ణి ఒకణ్ణి పిలిచి, ''ఒరే, నువు తెల్లవార్లూ గది బయటే కాపలా వుండి, మన అతిథి సుఖంగా నిద్రపోతాడో లేదో గమనిస్తూ వుండు!'' అని హెచ్చరించాడు.

సుదర్శనుడు భోజనం చేసి తన పడకగదికి వచ్చాడు. తలుపు గడియ పెట్టి పడుకుందామని పక్కమీద కూచుని చొక్కా విప్పాడు. చొక్కా జేబులో నుంచి రెండు మూడు గుప్పిళ్ళ పచ్చి శనగలు పక్కనిండా, గదినిండా పడ్డాయి.

జరిగిన సంగతేమిటంటే, సుదర్శనుడు వచ్చేటప్పుడు దారిపక్కన శనగ చేలు తగిలాయి. అతను బీదవాడూ, జాగర్త గలవాడూ కావటం చేత ఏ పూటనైనా భోజనం దొరకని పక్షంలో తిందామని,



శనగకాయలు కోసి, ఒలిచి, పచ్చి శనగలు రెండు జేబులనిండా పోసుకున్నాడు. తరవాత వాటి విషయం పూర్తిగా మరిచాడు.

ఈ దిక్కుమాలిన శనగలు గది అంతా పడటం వల్ల సుదర్శనుడికి పెద్ద చిక్కు వచ్చింది. తాను చిన్నవాడైనా, రాజుగారు తనకు గొప్పగా ఆతిథ్యమిచ్చాడు. నౌకర్లు రేపు ఈ శనగలన్నీ చూసి రాజుగారితో చెబితే ఆయనకు తనమీద ఉన్న ఆదరమంతా పోతుంది. అందుచేత సుదర్శనుడు నిద్రకు వాయిదా వేసి పక్కమీద పడిన శనగగింజలన్నీ జాగ్రత్తగా ఏరాడు. పక్క దుప్పటి తీసి దులిపాడు.



గది అంతా తిరుగుతూనే ఉన్నారు. పక్క దుప్పటి దులపటం కూడా వినిపించింది. మూడు జాములయాక నేను నిద్రపోయాను," అన్నాడు పహరావాడు.

మంత్రి వెంటనే రాజు దగ్గిరికి వెళ్ళి, "మహారాజా, మన అతిథి అతి సుకుమారుడు. నేను రాత్రి వేయించిన పక్క మీద మరొక సామాన్యుడైతే సుఖంగా నిద్రపోయే వాడే, ఇతను మహాభోగి! ఏ చక్రవర్తి కుమారుడో తప్ప మరొకడు కాడు!" అన్నాడు.

తెల్లవార్లూ శనగలు తిని ఉబ్బరంచేసి ఉన్న సుదర్శనుడు, మర్నాడు విందులో ఏ పదార్థమూ ఆసక్తితో ముట్టక పోవటం చూసి రాజుకూ, రాణికీ మంత్రి మాటలలో మరింత గురి కుదిరింది. రెండో రాత్రి మంత్రి సుదర్శనుడికి చక్కని హంసతూలికా తల్పం వేయించాడు. ఒక రాత్రల్లా నిద్రలేని కారణం చేత, సుదర్శనుడు తల్పంమీద నడుము వాలుస్తూనే గాఢనిద్రలో మునిగిపోయాడు. మంత్రి రాజదంపతులతో, "ఇక ఎటువంటి సందేహమూ వద్దు. నా భయమల్లా ఇంత గొప్ప వాడు అమ్మాయిని చేసుకోనంటాడేమోనని!" అన్నాడు.

"మామూలు మనిషిగా నటిస్తున్న వాడు అమ్మాయిని ఏ కారణం చేత చేసు

తరవాత గది అంతటా పడిన గింజలన్నీ ఏరాడు. ఒక్క గింజకూడా మిగల్చకుండా అన్నీ ఏరేసరికి అర్ధరాత్రి దాటిపోయింది. ఇంక ఈ శనగలను జేబులో ఉంచుకోవటం ప్రమాదకరం. ఆకలి లేకపోయినా, సుదర్శనుడు శనగలు తినసాగాడు. అతను పడుకునే సరికి రాత్రిమూడు జాములయింది.

మర్నాడు ఉదయం మంత్రి పహరావాణ్ణి పిలిచి, "ఏంరా? రాత్రి చిన్నబాబుగారు సరిగా నిద్రపోయారా?" అని అడిగాడు,

"బాబూ! రాత్రి ఆయనకీ నిద్రలేదు, నాకూ నిద్రలేదు. తెల్లవార్లూ ఆయన

కొనంటాడూ? మీరు సంశయించక అతన్ని అడిగి చూడండి!'' అన్నది రాణి చిరుకోపంగా.

మంత్రి ఇందుమతిని వెంట పెట్టుకు పోయి సుదర్శనుడితో పెళ్ళి ప్రస్తావన చేశాడు. మొదట తెల్లబోయి తరవాత సుధర్శనుడు పెళ్ళికి ఒప్పుకున్నాడు. రాజూ, రాణీ పొందిన ఆనందానికి మేర లేదు. దగ్గిరలో ఉన్న శుభముహూర్తాన బీద బ్రహ్మచారి సుదర్శనుడికీ, రాజ కుమార్తె ఇందుమతికీ వివాహం జరిగింది.

ఒక ఏడాదిపాటు సుదర్శనుడు సమస్త సుఖాలూ అనుభవించాడు. తరవాత అతని కష్టాలు ప్రారంభమయాయి.

ఒకరోజు ఇందుమతి తన భర్తతో, ''ఏమండీ? ఇట్లా ఎంతకాలం మనం ఇక్కడ కూచుంటాం? మన రాజ్యానికి మనం పోదాం పదండి!'' అన్నది.

సుదర్శనుడు నిర్ఘాంతపోయి, ''మన రాజ్యమా?'' అన్నాడు.

''అవును. మీరు మహారాజులని నాకు పెళ్ళికాక పూర్వమే తెలుసులెండి! ఎంతకాలం ఆడతారీ నాటకం?'' అంటూ ఇందుమతి, మంత్రి పెట్టిన పరీక్షలు వివరించి చెప్పింది. అదంతా వింటుంటే సుదర్శనుడికి మతిపోయినట్టయింది.

కాని తన భార్యకు యిప్పుడొక రాజ్యం చూపక తప్పదు. ఆమెతో నిజం చెప్పెయ్యవచ్చు. కాని ఆమె నొచ్చు





కుంటుందని అతను భయపడ్డాడు. భార్యను ఏ మాత్రం బాధ పెట్టటం అతనికి ఇష్టంలేదు.

"ఈమెతో బయలుదేరి దేశాటన చేస్తాను. కాలక్రమాన నిజం ఈమే తెలుసుకుంటుంది!" అనుకుని సుదర్శనుడు, అత్తమామలకు చెప్పి, ఒక శుభ ముహూర్తాన భార్యతో బయలుదేరాడు. వారాలూ, నెలలూ గడిచాయి. ఒక ఊరు నుంచి మరొక ఊరికీ, ఒక దేశం నుంచి మరొక దేశానికీ దంపతులు ప్రయాణం చేస్తున్నారు. భర్త తనను తన దేశానికి తీసుకుపోతున్నాడన్న దృఢ నమ్మకం తప్ప ఇందుమతికి మరేమీ తెలియదు. ఆమె అతనితో పాటు నడిచింది, చెట్ల కింద పడుకున్నది, అష్టకష్టాలూ పడింది; కాని ఒక్కసారి కూడా తన భర్తను, "మనం ఎటు పోతున్నాం? ఎక్కడికి పోతున్నాం?" అని అడిగిన పాపాన పోలేదు.

ఎన్నోసార్లు సుదర్శనుడు తన భార్యను ఏమార్చి ఒంటరిగా వెళ్ళిపోదామనుకున్నాడు, కాని తనయందు అంత మూఢ విశ్వాసం ఉంచి, తనతో సమానంగా కష్టాలుపడే భార్యను విడిచి పోవటానికి అతనికి మనస్సు రాలేదు. రాజాంతఃపురంలో కన్న ఇందుమతి ఇప్పుడతనికి చాలా రెట్లు ప్రియతమురాలయింది.

ఇల్లు విడిచిన ఆరు మాసాలకు భార్యాభర్తలు కళింగనగరం చేరారు. వర్తకుల వద్ద ఇందుమతి నగలు కొన్ని విక్రయించి పేదరాశి పెద్దమ్మ ఇంట బస చేశారు.

ఈ ఇద్దరినీ చూడగానే పేదరాసి పెద్దమ్మకు అనుమానం కలిగింది. ఇందుమతి రాజకుమార్తె అన్నది కనిపిస్తూనే వున్నది. కాని పెద్దమ్మ కళ్ళు సుదర్శనుడి మీదనే ఉన్నాయి. ఏమంటే, పదిహేనేళ్ళ క్రితం కళింగరాజు కుమారుణ్ణి దొంగలు ఎత్తుకుపోయారు. ఆ కుర్రవాడు జీవించి వుంటే సుదర్శనుడి

ఈడు వాడే అయి వుండేవాడు. ఇతనే అతనేమోనని పేదరాశి పెద్దమ్మకు తోచింది.

ఆమె ఇందుమతిని చాటుకు పిలిచి, "అమ్మా, మీ రెవరు? నీ భర్తకు ఏం పని?" అని అడిగింది.

"నేను పురందర రాజకుమార్తెను. నా పేరు ఇందుమతి. నా భర్త ప్రచ్ఛన్నంగా తిరుగుతూన్న రాజకుమారుడు," అన్నది ఇందుమతి.

"నీ భర్త ఏ దేశపు రాకుమారుడు?" అని అడిగింది పేదరాసి పెద్దమ్మ. ఆత్రంగా.

"అది నాకూ తెలియదు. నేను నా భర్తను అడగలేదు. మేము చాలా రోజులుగా ప్రయాణం చేస్తున్నాం," అన్నది ఇందుమతి.

పెద్దమ్మ అనుమానం దృఢపడింది. ఆమె దివాణానికి వెళ్ళి కళింగరాజుతో, "మహాప్రభూ, మా ఇంటికి ఒక కుర్రవాడు భార్యతో సహా వచ్చాడు. చిన్నతనంలో దొంగలు ఎత్తుకుపోయిన మీ కుమారుడేనని నాకు అనుమానంగా ఉన్నది," అని చెప్పింది.

"ఆ భార్యాభర్తలను ఒకసారి ఇక్కడికి తీసుకురా," అన్నాడు రాజు.

ఆ సాయంకాలమే పేదరాశి పెద్దమ్మ సుదర్శనుణ్ణీ, ఇందుమతినీ రాజాంతఃపురానికి తీసుకుపోయింది. సుదర్శనుణ్ణి చూడగానే కళింగరాజూ, ఆయన భార్యా చాలా ముచ్చట పడ్డారు. అతనిలో రాజుకు రాణి పోలికలూ, రాణికి రాజు పోలికలూ కనిపించాయి.

"నాయనా! నువు మా కొడుకువే! మా దగ్గిరే ఉండిపో!" అన్నాడు కళింగ రాజు. సుదర్శనుడు ఒప్పుకున్నాడు.

సుదర్శనుడికి యువరాజ్యాభిషేకం చేశారు. పురందర దేశానికి ఈ శుభవార్త చేరగానే, అక్కడి మంత్రి, "నేనప్పుడే చెప్పలేదా? మనకు కళింగ యువరాజు అల్లుడు కావటం ఎంత అదృష్టం!" అన్నాడు.



# సత్రం లేని నగరం

ఒక రోజు ఓరుగల్లు నగరంలో రాజూ, మంత్రీ మారువేషాలలో తిరుగుతూండగా ఒక దృశ్యం కంటపడింది. మరో దేశం నుంచి వ్యాపారం నిమిత్తం వచ్చిన ఇద్దరు వర్తకులు దారే పొయ్యేవారిని, "అయ్యా, ఈ నగరంలో మేము బస చెయ్యటానికి ధర్మశాల ఎక్కడ ఉన్నది?" అని అడిగారు.

"ఈ నగరంలో ధర్మశాలలు లేవే!" అన్నారు నగరవాసులు ఆ వర్తకులతో.

వర్తకులు ఆశ్చర్యపోయి, "ఇంత మహా నగరంలో బాటసారులకు ధర్మశాల లేదా? ఇలాంటి పరిపాలన ఎక్కడా చూడలేదే!" అని కొంచెం అవహేళనగా అన్నారు.

వెంటనే అటుగా పోతున్న రాజభటుడు ఒకడు ఆగి వర్తకుల మాటలు విని, "అయ్యా, పరదేశీయులకు ధర్మశాలలలో సౌకర్యాలు సరిగా అమరవని మా రాజుగారు బాటసారులకు తమ భటుల ఇళ్ళలోనే బస ఏర్పాటు అయేటట్టు నియమించారు," అని వర్తకులను తన ఇంటికి తీసుకుపోయి, తన సొంత ఖర్చుతో వారికి షోడశోపచారాలూ చేశాడు.

తన పరువు నిలబెట్టిన ఆ భటుణ్ణి మర్నాడు రాజు ఘనంగా సత్కరించటమేగాక, వెంటనే నగరంలో ధర్మశాలలు ఏర్పాటు చేయించాడు.

—వేమూరు వెంకయ్య






విశ్వామిత్రుడు త్రిశంకుణ్ణి స్వర్గానికి పంపేసిన అనంతరం త్రిశంకుడి కొడుకు హరిశ్చంద్రుడు రాజ్యంచేయ నారంభించాడు. అయితే అతనికి సంతానం కలగలేదు. అతడు తన పురోహితుడైన వసిష్ఠుడితో, "మహాత్మా, నువు దైవజ్ఞుడివి. మంత్రవేత్తవూనూ. అందుచేత, నాకు సంతానం కలగని కారణం ఏమిటో ఆలోచించి చెప్పు. అందుకు కారణం నా ప్రారబ్ధం కాదుగద?" అని దీనంగా అన్నాడు.

"సంతానం లేకపోవటం కన్న గొప్ప దుఃఖం లేని మాట నిజమే. వరుణుడు సంతాన కారకుడుగా ప్రసిద్ధికెక్కిన వాడు. అందుచేత ఆ వరుణుణ్ణి పూజించి సులభంగా సంతానం పొందవచ్చు. మనుష్యయత్నం లేకుండా దైవం అనుకూలించలేదు గదా!" అన్నాడు వసిష్ఠుడు.

ఆ మాటమీద హరిశ్చంద్రుడు గంగా తీరాన ఘోర తపస్సు చేశాడు. ఆ తపస్సుకు వరుణుడు సంతోషించి ప్రత్యక్షమై, ఏమి వరం కావాలని హరిశ్చంద్రుణ్ణి అడిగాడు.

హరిశ్చంద్రుడు తన్మయత్వం చెందుతూ, ఒక కొడుకును ప్రసాదించి, తనకు సంతాన హీనత్వం పోగొట్టమన్నాడు.

"చక్కని కొడుకును, సద్గుణశీలుణ్ణి ఇస్తాను. కాని వాణ్ణి నువు నాకు బలి పశువుగా ఇయ్యవలసి వుంటుంది," అన్నాడు వరుణుడు చిరునవ్వుతో.

25. హరిశ్చంద్రుడి కథ



హరిశ్చంద్రుడికి చెంపపెట్టు తగిలినట్టయింది. కాని ఏమీ చెయ్యలేక, "గొడ్డుమోతు అనిపించుకునే కన్న అదీ కొంత నయమే! మీరు కోరినట్టే చేస్తాను. కొడుకును ప్రసాదించండి!" అన్నాడు.

"తప్పకుండా కొడుకు కలుగుతాడు. ఇంటికి వెళ్ళు!" అన్నాడు వరుణుడు.

హరిశ్చంద్రుడు ఇంటికి తిరిగివచ్చి, తన పట్టమహిషి అయిన శైబ్యతో జరిగిన సంగతి చెప్పాడు. ఆమె కూడా సంతోషించింది.

తరువాత ఆమె గర్భాన పది నెలలకు మన్మధుడి లాటి కొడుకు పుట్టాడు. హరిశ్చంద్రుడు తన కొడుక్కు రోహితుడని పేరు పెట్టి జాతకర్మ చేయించి, బ్రహ్మాండమైన ఉత్సవం ఏర్పాటు చేశాడు. దానికి వరుణుడు ఒక బ్రాహ్మడి రూపంలో వచ్చి, స్వస్తి వచనం చెబుతూ తాను ఎవరైనదీ బయటపెట్టి, "నేనిచ్చిన వరంతో నీకు సంతాన హీనత అనే దోషం పోయింది, కాబట్టి, చిత్తశుద్ధితో నీ కొడుకును యజ్ఞపశువును చేసి నాకు బలిపెట్టు!" అన్నాడు.

హరిశ్చంద్రుడికి పుట్టెడు దిగులు పట్టుకున్నది. లేకలేక కలిగిన చంటివాణ్ణి వరుణుడికి ఎలా బలి ఇయ్యటం? వరుణుడు ఒకంత వదలడు. దేవతలతో కూడిన పని! చేతులారా కొడుకును చంపుకుంటే ఆ శోకం జీవితాంతమూ పోయేదికాదు.

ఇలా అనుకుని హరిశ్చంద్రుడు కొంత ధైర్యం కూడగట్టుకుని, వరుణుణ్ణి వినయంగా, "దేవా, తండ్రికి పురిటిమైల పదిరోజులూ, తల్లికి నెలరోజులూ వుంటుంది గదా? ఈ లోపల మేం యజ్ఞదీక్ష పూనేది ఎలా?" అని అడిగాడు.

"అలా అయితే నెలదాటగానే వస్తాను," అని చెప్పి వరుణుడు వెళ్ళిపోయాడు.

హరిశ్చంద్రుడికి పోయిన ప్రాణం వచ్చినట్టయింది. అతను బ్రాహ్మణులకు

గోవులూ, నువ్వులూ, బంగారమూ దానం చేసి, కొడుకును చూసుకుని మురిసి పోయాడు.

మాసం గడిచింది. వరుణుడు మళ్ళీ బ్రాహ్మణవేషంలో వచ్చి యజ్ఞం చెయ్యమన్నాడు.

హరిశ్చంద్రుడు బరువెక్కిన గుండెతో వరుణుడికి నమస్కారం చేసి "తమరి రాక వల్ల నా యిల్లు పావనమయింది. పిల్లవాణ్ణి యజ్ఞ పశువుగా ఎలా చెయ్యటం? దంతాలు రాని పశువు బలికి పనికిరాదు గదా?" అన్నాడు.

"సరే, పిల్లవాడికి దంతాలు రాగానే నాకు బలిపెట్టు!" అని వరుణుడు వెళ్ళిపోయాడు.

కొంతకాలం గడిచినాక పిల్లవాడికి పళ్ళు కనిపించాయి. వరుణుడు వచ్చి, యజ్ఞం చెయ్యమని కూర్చున్నాడు. హరిశ్చంద్రుడు వరుణుడికి సమస్త మర్యాదలూ చేసి, "తమకు తెలియనిదేమున్నది? చౌలమూ, పుట్టు వెంట్రుకలు తీయటమూ జరగని కుర్రవాడు యజ్ఞపశువుగా పనికిరాడని పెద్దలు చెబుతారు. ఆ రెండూ కాగానే తమకు కుర్రవాణ్ణి బలి ఇస్తాను!" అన్నాడు హరిశ్చంద్రుడు.

"నువు కొడుకు మీది మమకారంతో నోటికి వచ్చినట్టు అబద్ధాలాడుతూ, నన్ను తెగ తిప్పుతున్నావు. నువు కపటివి. పుట్టు వెంట్రుకలు తీయగానే కుర్రవాణ్ణి





నాకు బలి యియ్యకపోయావో, నిశ్చయంగా నీకు ఘోరమైన శాపం యిస్తాను. మహాత్ముడైన ఇక్ష్వాకుడి వంశాన పుట్టి, మాట నిలబెట్టుకోలేక పోయాడన్న అపకీర్తి తెచ్చుకోకు! వస్తా!'' అంటూ వరుణుడు వెళ్ళిపోయాడు.

మరికొంత కాలం గడిచింది. రోహితుడికి పుట్టు వెంట్రుకలు తీసే వయసు వచ్చింది. హరిశ్చంద్రుడూ, భార్యా, తొడమీద కూర్చుని కుర్రవాడూ చూడాకరణం వేడుకలో ఉండగా వరుణుడు వచ్చి, ''రాజా, పిల్లవాడికి పుట్టువెంట్రుకలు తీయిస్తున్నావు గద! ఆలస్యం దేనికి? యజ్ఞం ప్రారంభించు,'' అన్నాడు.

హరిశ్చంద్రుడు తడువుకోకుండా, ''ఆ మాట నాకు గుర్తులేక పోలేదు. కాని ఈ పిల్లవాడు యాగపశువుగా పనికిరాడు. ఉపనయనం జరిగితే గాని వీడికి ద్విజత్వం రాదు. అంతదాకా వీడు నాలుగో వర్ణం వాడి కిందనే లెక్క, కర్మబాహ్యుడు,'' అన్నాడు.

బ్రాహ్మడికి ఎనిమిదేళ్ళకూ, క్షత్రియుడికి పదకొండేళ్ళకూ, వైశ్యుడికి పన్నెండేళ్ళకూ ఉపనయనం జరగాలని శాస్త్రాలు నిర్ణయించాయి గనక, పదకొండో ఏట రోహితుడికి ఉపనయనం జరిపించి, శాస్త్రోక్తంగా యజ్ఞం చేసి, అందులో వాణ్ణి బలిపశువును చేసి ఇచ్చుకుంటాననీ, ఇప్పటికి వెళ్ళిరమ్మనీ హరిశ్చంద్రుడు వరుణుడితో అన్నాడు.

వరుణుడు ఈ మాటకు తృప్తిపడి వెళ్ళిపోయాడు. తరవాత హరిశ్చంద్రుడు తన కొడుకును చూసుకుని ఆనందిస్తూ కాలం వెళ్ళబుచ్చాడు.

కాలక్రమాన కుర్రవాడికి పదేళ్ళు నిండి, పదకొండవ ఏడు ప్రవేశించింది. హరిశ్చంద్రుడు గుండె పీచుపీచుమంటూ, వాడికి శాస్త్రోక్తంగా ఉపనయనం జరిపించాడు.

వరుణుడు వచ్చి యజ్ఞం చెయ్యమని కూర్చున్నాడు.

''యజ్ఞం చెయ్యవలసినదే, నేను కాదనను. కాని కుర్రవాడు ఇప్పుడే వేద విద్య ఆరంభించాడు. నన్ను అనుగ్రహించి, వాడి విద్యాభ్యాసం పూర్తి కానియ్యండి. వాణ్ణి మీకు అవశ్యం బలి ఇస్తాను!'' అని హరిశ్చంద్రుడు ప్రాధేయ పడ్డాడు. వరుణుడికి కోపం వచ్చింది.

''నీ నక్క వినయాలతో జాప్యం చేస్తూ వస్తున్నావు. కొడుకు మీది మమకారం తెంచుకోలేక నన్ను ఇలా చేస్తావా? అయినా నీ మాట నమ్మి ఈ సారికి వెళు తున్నాను. నీ కొడుకు వేదవిద్య ముగియ గానే వస్తాను,'' అని వరుణుడు వెళ్ళి పోయాడు.



కొంతకాలం గడిచింది. ''వరుణుడు వచ్చి కూర్చుంటాడు కాబోలురా, దేవుడా!'' అని పుట్టెడు దిగులులో మునిగి పోయిన హరిశ్చంద్రుణ్ణి చూసి రోహితుడు, ''ఎందుకలా విచారంగా వున్నావు?'' అని తండ్రిని అడిగి, కారణం తెలుసుకున్నాడు.

రోహితుడికి ప్రాణభయం పట్టుకున్నది. వాడు మంత్రి కొడుకుల సలహా మీద అరణ్యంలోకి పారిపోయాడు. వరుణుడు వచ్చి ఏమంటాడోనన్న భయంతో హరిశ్చంద్రుడు వాడికోసం వెతికించాడు. కాని రోహితుడి జాడ తెలియలేదు.

ఇంతలో, యజ్ఞం చెయ్యమంటూ వరుణుడు రానేవచ్చాడు.

హరిశ్చంద్రుడు భయంతో కంపించి పోతూ వరుణుడికి మొక్కి, ''నా కొడుకు చావుకు భయపడి పారిపోయాడు. నేనేం చెయ్యను? వాడికోసం అడవులూ, కొండలూ, పల్లెలూ వెతికించాను. లాభం లేకపోయింది. తమరు ఏం చెయ్యమంటే అది చేస్తాను. చివరకు దోషిని నేనే అయాను," అన్నాడు.

''నన్ను ఇంత మోసం చేస్తావా? జలోదరంతో తీసుకో!'' అంటూ హరిశ్చంద్రుణ్ణి శపించి, వరుణుడు వెళ్ళి పోయాడు.



మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టు, హరిశ్చంద్రుడు కొడుకు జాడ తెలియక పోవటంతో బాటు వరుణుడి శాపం తగిలి బాధపడసాగాడు.

ఒక సంవత్సరం గడిచాక, రోహితుడికి తండ్రి రోగం గురించి తెలిసి ఇంటికి పోబోతుండగా, ఇంద్రుడు బ్రాహ్మణ రూపంలో వచ్చి, వాణ్ణి ఆపి, "ఎందుకు పోతావు? నీ తండ్రి తన రోగం నయం కావటం కోసం యజ్ఞం చేసి, నిన్ను వరుణుడికి బలి ఇస్తాడు. నీ తండ్రి చచ్చిపోయిన దాకా ఆగి తరవాత వెళ్ళి నిశ్చింతగా రాజ్యం ఏలుకో," అని సలహా ఇచ్చాడు.

మరొక సంవత్సరం గడిచింది. తన తండ్రి జబ్బుతో చాలా బాధపడుతున్నట్టు తెలిసి, రోహితుడు చావటానికి కూడా సిద్ధపడి మరొకసారి ఇంటికి బయలుదేరాడు. కాని ఈసారి కూడా ఇంద్రుడు అతన్ని పోవద్దన్నాడు.

హరిశ్చంద్రుడు మాత్రం జలోదర వ్యాధి బాధ భరించలేక, దానికేదన్నా ఉపాయం చూడమని వసిష్ఠుణ్ణి అడిగాడు.

"వరుణుడు బలికోరేది నీ కొడుకును గదా? కొడుకులు పది రకాలున్నారు. అందులో కొనుక్కున్నవాడు కూడా ఒక రకం కొడుకే. అందుకని ఎవడినన్నా కొడుకుగా కొనుక్కుని, వరుణుడికి వాణ్ణి బలిపెట్టి, శాపం నుంచి విముక్తి పొందు," అని వసిష్ఠుడు సలహా ఇచ్చాడు.

హరిశ్చంద్రుడు సరేనని, తన కోసం ఒక కొడుకును కొనుక్కురమ్మని తన మంత్రిని పంపాడు. ఆ మంత్రి వెతకగా, వెతకగా కటిక దరిద్రుడైన అజీగర్తుడు అనే బ్రాహ్మణుడు తగిలాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు, శునఃపుచ్ఛుడూ, శునశ్శేపుడూ, శునోలాంగూలుడూ అనే వాళ్ళు.

అజీగర్తుడితో హరిశ్చంద్రుడి మంత్రి, "అయ్యా, మా రాజు రోగవిముక్తుడు

కావటానికి నరమేధం చేయ తలపెట్టాడు. బలిపశువుగా నీ కొడుకులలో ఒక్కణ్ణి నూరు గోవులకు అమ్ముతావా?'' అని అడిగాడు.

కటిక దరిద్రుడైన అజీగర్తుడు ఈ మాటకు పరమానందం చెంది, తన పెద్ద కొడుకును తప్ప మిగిలిన ఇద్దరిలో ఎవరినైనా అమ్మటానికి సిద్ధపడ్డాడు. మూడో వాణ్ణి తల్లి ఇయ్యనన్నది. అందుచేత ఆ బ్రాహ్మణుడు తన రెండో కొడుకైన శునశ్శేపుణ్ణి హరిశ్చంద్రుడి మంత్రికి అమ్మాడు. మంత్రి వాణ్ణి తీసుకుపోయి హరిశ్చంద్రుడికి ఇచ్చాడు.

శునశ్శేపుణ్ణి యజ్ఞపశువును చేసి యూపస్తంభానికి కట్టారు. రాజు యాగ దీక్ష పూనాడు. ఇది చూసి మునులందరూ చాలా నొచ్చుకున్నారు. శునశ్శేపుడు తనకు రానున్న చావు తలచుకుని తెగ ఏడుస్తున్నాడు.

కుర్రవాణ్ణి వధించవలసినవాడు జాలిపడి, వాణ్ణి తాను చంపలేనంటూ దూరంగా పోయాడు.

హరిశ్చంద్రుడు సదస్యులను చూసి, ''ఇప్పుడు ఏం చెయ్యాలి?'' అని అడిగాడు. సభలో కలకలం బయలుదేరింది. శునశ్శేపుడు గుండెలు తరుగుకు పోయేటట్టు ఏడుస్తున్నాడు.

అంతలో సభాసదుల మధ్యనుంచి అజీగర్తుడు చివాలున లేచి, ''రాజా, ఈ బలిపశువును నేను వధిస్తాను. నాకు

61



ముందిచ్చిన దానికన్న రెట్టింపు గోవులు ఇస్తావా?'' అని అడిగాడు.

హరిశ్చంద్రుడు సరేనన్నాడు. సభలో హాహాకారాలు చెలరేగాయి.

''వీడు బ్రాహ్మణుడు కాడు, పిశాచం! లాభంకొద్దీ కొడుకును హత్యచేయ సిద్ధపడిన మహా పాపి!'' అంటూ అజీగర్తుణ్ణి అందరూ తిట్టిపోశారు.

ఇంతలో విశ్వామిత్రుడు అక్కడికి వచ్చి, శునశ్శేపుణ్ణి చూసి జాలిపడి, ''హరిశ్చంద్రా, ఈ పాపిష్ఠి యజ్ఞం మాను. నీ ప్రాణం నీకు ఎంత తీపో, వీడికి వీడి ప్రాణం అంత తీపి కాదా? శాపం పొందిన నీ తండ్రిని నేను స్వర్గానికి పంపాను. అందుకైనా ఈ బ్రాహ్మణ పుత్రుణ్ణి విడిచిపెట్టు!'' అన్నాడు.

''అయ్యా, జలోదరం బాధ భరించలేకుండా ఉన్నాను. దయచేసి యాగభంగం చెయ్యకండి. నేనీ కుర్రవాణ్ణి యజ్ఞపశువుగా కొనుక్కున్నాను.'' అన్నాడు హరిశ్చంద్రుడు.

విశ్వామిత్రుడికి కోపం వచ్చింది. అతను శునశ్శేపుణ్ణి సమీపించి, ''ఈ రాజు నిన్నేం చెయ్యగలడు? నేను నీకొక మంత్రం చెబుతాను. దానితో నీకు సుఖం కలుగుతుంది!'' అన్నాడు.

విశ్వామిత్రుడు చెప్పిన మంత్రాన్ని శునశ్శేపుడు జపించే సరికి, వరుణుడు ప్రత్యక్షమై, శునశ్శేపుణ్ణి విడిపించి, యజ్ఞం ముగిసినట్టు ప్రకటించి, హరిశ్చంద్రుడికి వ్యాధి పోగొట్టాడు.

శునశ్శేపుడు సభకు నమస్కారంచేసి, ''అయ్యాలారా, ఇప్పుడు నా తండ్రి ఎవరో మీరు నిర్ణయిస్తే, నేను అయన వెంట పోతాను,'' అన్నాడు.

కొందరు శునశ్శేపుడి తండ్రి హరిశ్చంద్రుడనీ, కొందరు అజీగర్తుడేననీ, మరికొందరు వరుణుడనీ, రకరకాలుగా చెప్పారు.

వసిష్ఠుడు మాత్రం విశ్వామిత్రుడే శునశ్శేపుడి తండ్రి అన్నాడు. ఆ కుర్రవాడు విశ్వామిత్రుడి వెంట వెళ్ళిపోయాడు.






మగధదేశపు రాజు శక్తిసేనుడి పరిపాలనలో కలతలు బయలుదేరి, వేరు వేరు తరగతులమధ్య కలహాలుగా పరిణమించి, అరాజక పరిస్థితి ఏర్పడింది. అన్ని మతాల వారూ, వృత్తుల వారూ, కులాల వారూ, తమ తమ వృత్తులకూ, వ్యాపకాలకూ ఉద్వాసన చెప్పి యుద్ధానికి దిగినట్టుగా తయారయారు.

ఈ పరిస్థితిని అదుపులో పెట్టటానికి శక్తిసేనుడు ఏవో శాసనాలు చేశాడు, కాని ఆ శాసనాల ఆధారంతోనే ప్రజలు మరింతగా అంతఃకలహాలు కొనసాగించారు.

రాజు తన అసమర్థతను గ్రహించి, మంత్రీ, పురోహితుడూ అయిన యజ్ఞశర్మను, "ప్రజాజీవితం ఇలా కంటక ప్రాయం అయిపోతున్నదేం? ఈ పరిస్థితులలో సరి అయిన పరిపాలన జరగాలంటే ఏం చేయవలసి వుంటుంది?" అని అడిగాడు.

దానికి యజ్ఞశర్మ, "రాజా, నీ అనుమానాలు తీరగలందులకు ఒక చిన్న ఇతిహాసం చెబుతాను, శ్రద్ధగా విను!" అంటూ ఇలా చెప్పసాగాడు:

పాతాళలోకంలో రాక్షసరాజ్యం సుభిక్షంగా ఉండే రోజుల్లో, అఘోరుడు అనే రాక్షసుడు అల్లరులు లేవనెత్తి, అలజడి కలిగించసాగాడు. అది చూసి రాక్షస రాజు అఘోరుణ్ణి పాతాళం నుంచి బహిష్కరించాడు. ఆ విధంగా అఘోరుడు భూలోకానికి రావడం జరిగింది. వస్తూనే వాడు ఒక ఎడారి ప్రాంతంలో అడుగు పెట్టాడు. అక్కడ వాడికి ఏ విధమైన తిండీ దొరకక మనుషులుండే ప్రాంతాలకు వచ్చి, అందిన మనుషులను విరుచుకు తినసాగాడు.



ఇందువల్ల భూలోకంలో పెద్ద సంచలనం కలిగింది. అఘోరుడు ఎప్పుడు ఏ ప్రాంతానికి వస్తాడో తెలియదు, ఏ క్షణాన ఎవరికి చావుమూడుతుందో తెలియదు.

భూలోకంలో చాలా దేశాలున్నాయి. ఎవరి భాష వాళ్ళది. ఎవరికి వాళ్ళే అందరికన్నా గొప్పవాళ్ళు. ఏ రెండు దేశాలకూ పడదు. ప్రతిదేశమూ ఇతర దేశాలను జయించి, వాటిపై పెత్తనం చలాయించాలని చూస్తుంది. అందుచేత తరచుగా యుద్ధాలు జరుగుతుంటాయి. అందులో పై చెయ్యిగా ఉండటానికి కొత్తకొత్త మారణాయుధాలు కనిపెట్టబడుతూ ఉంటాయి.

అఘోరుడు భూలోకానికి వచ్చిన తొలి రోజుల్లో అనేక మంది వీరులు ముందుకు వచ్చి తమ తమ దేశాలను వాడి బారి నుండి కాపాడటానికి ప్రయత్నించారు. కాని తాటిచెట్టు ప్రమాణం గల అఘోరుడి శరీరం మామూలు ఆయుధాలను లక్ష్యపెట్టేది కాదు. వాడు భూలోకంలో విచ్చలవిడిగా సంచరిస్తూ అలజడి కొనసాగిస్తూనే వచ్చాడు.

వ్యక్తుల శౌర్యపరాక్రమాలు రాక్షసుడి మీద పనిచెయ్యవనీ, ఈ రాక్షసుడి వల్ల అన్నిదేశాల ప్రజలకూ ప్రమాదమేననీ స్పష్టమయింది. అప్పుడు దేశదేశాల రాజులందరూ ఒకచోట సమావేశమై, కర్తవ్యం గురించి చర్చించారు. అందరిలోకీ అనుభవజ్ఞుడైన ఒక రాజు ఇలా అన్నాడు:

"లక్ష చీమలు కలిసి ఒక పామును చంపగలుగుతున్నాయి. గడ్డిపోచలను కలిపి వేసిన తాడు మదపుటేనుగును బంధించటానికి పనికి వస్తున్నది. ఐకమత్యాన్ని మించిన బలంలేదు. భూమి మీది మనుషులంతా ఒకటైతే ఆ రాక్షసుణ్ణి ఎదుర్కోవడం పెద్ద సమస్య కానేకాదు."

ఇంతకంటే మంచి ఆలోచన లేదని అందరూ ఒప్పుకున్నారు.

అఘోరుణ్ణి ఎదుర్కోవడం కోసం మర్నాడే ప్రజలంతా ఒకచోట కూడ సాగారు. వందలూ, వేలతో ఆరంభమై జనసమూహం లక్షలకూ, కోట్లకూ చేరుకున్నది. భాషలను గురించీ, సంస్కృతులను గురించీ మరచిపోయి, అందరూ ఒక్కటైపోయారు.

ఈ మహాసైన్యం రెండురోజుల్లో అఘోరుణ్ణి అందుకున్నది. వెంటనే రాక్షసుడికీ, జనసమూహానికి యుద్ధం ఆరంభమయింది. వాణ్ణి చూసిగాని, వాడిపాదాల కింద నలిగి చస్తామని గాని ఎవ్వరూ భయపడలేదు. క్షణాల మీద పోయి అఘోరుణ్ణి ఆపాదమస్తకమూ మనుషులు కమ్మేశారు.

అంతటి రాక్షసుడూ తన జీవితంలో మొదటిసారిగా భయం అంటే ఏమిటో తెలుసుకున్నాడు. ఇంతమంది జనం ధాటికి తన వజ్రశరీరం కూడా తట్టుకోలేదని వాడికి తెలిసిపోయింది. అందుకని వాడు జనాన్ని ఎదుర్కొనే ఆలోచన కట్టిపెట్టి పరుగు లంకించుకున్నాడు. పరిగెడుతున్న వాడి కాళ్ళకింద ఎందరో నలిగి చచ్చారు. వాడి శరీరం మీదికి పాకిన మనుషులు కిందికి దూకి కాళ్ళూ, చేతులూ విరుచుకున్నారు. అయితేనేం? ప్రజలకు వాడి పీడ వదిలింది.

అటు తరవాత అఘోరుడు మనుషులను ఎదుర్కోవడానికి రెండు మూడు ప్రయత్నాలు చేసి ఘోరంగా దెబ్బతిని,





దిగ్భ్రమ కలిగించింది ఆ రాక్షసిని వాడు పాతాళలోకంలో ఎరుగును. ఆమె పేరు అఘోరిక. ఆమె ఇలా అన్నది:

"నువ్వు వెళ్ళిపోయాక పాతాళలోకం చిన్నబోయిందని పించింది. నిన్ను వెతుక్కుంటూ ఇలా వచ్చాను. ఎందుకైనా మంచిదని మనిషి రూపంలో వచ్చాను."

అఘోరుడు ఆమెకు తన భూలోకపు అనుభవాలు చెప్పాడు.

అఘోరిక నవ్వి, "వెర్రివాడా, మనుషులు బలంగల వాళ్ళు కాకపోయినా, తెలివిగల వాళ్ళు. వాళ్ళను బలంతో కన్న తెలివితో ఎదుర్కోవాలి! మనం వాళ్ళమధ్య వాళ్ళ రూపాలతోనే నివసిస్తూ, వాళ్ళను మోసం చెయ్యాలి. అప్పుడు జీవితం పాతాళలోకంలో కన్న బాగుంటుంది!" అన్నది.

రాక్షసులిద్దరూ మానవరూపాలు ధరించి, మానవుల మధ్య జీవించసాగారు. మనుషులకు తెలివి తేటలుంటే ఉన్నాయేమో గాని, వాళ్ళు వట్టి స్వార్థపరులని త్వరలోనే వాళ్ళకు తెలిసిపోయింది. వాళ్ళు మనుషుల స్వార్థాన్ని అవకాశంగా తీసుకుని మనుషులను ఒకరిమీద ఒకరిని రెచ్చగొట్టసాగారు. ప్రజలలో మళ్ళీ అన్ని రకాల భేదాలూ వచ్చేశాయి — భాషాభేదాలూ, జాతి

చావు తప్పి కన్ను లొట్టపోయినట్టు అయాడు. తరవాత వాడు అరణ్యాలను ఆశ్రయించి, తన జీవన విధానం మార్చుకుని, పొదుపుగా జంతువులను చంపితినసాగాడు. లేకపోతే వారం రోజుల్లో అడివంతా ఖాళీ అయి, తాను తిండికి మాడవలసి వస్తుంది.

అయితే వాడికి నరమాంసం మీద భ్రాంతి తగ్గలేదు. వాడి అదృష్టం బాగుండి, ఒకసారి అడవిలో వాడికి ఒక ఆడది కనిపించింది. ఆమెను తిందామనే ఉద్దేశంతో వాడు చెయ్యిచాచి, ఆమెను పట్టుకున్నాడు. అంతలోనే ఆ ఆడది రాక్షసిగా మారిపోయి వాడికి

భేదాలూ, కులభేదాలూ, మతభేదాలూ! మనుషుల మధ్య కొట్లాటలు ఎక్కువ అయ్యాయి. అఘోరుడూ, అఘోరికా ఈ గందరగోళంలో మనుషులను అపహరించి తింటూ రాసాగారు. మనుషులు ఒకరినొకరు అనుమానించుకుంటూ, తమ మధ్యనే వున్న రాక్షసులను అనుమానించలేకపోయారు!

రాక్షసులకు ఈ జీవితం చాలా బాగున్నది. వాళ్ళు భూలోకంలో శాశ్వతంగా ఉండిపోదలచుకున్నారు. వారి సంతతి క్రమంగా ప్రపంచం అన్ని మూలలకూ విస్తరించింది. వాళ్ళు తమ సంతతికి ఇలా హితబోధ చేశారు:

''మీరు రాక్షసులని తెలిస్తే మనుషులంతా ఒక్కటై పోతారు. మనిషి రూపంలోని రాక్షసుణ్ణి వాళ్ళు ఎంతో ఆదరిస్తారు. అదే మనకు క్షేమం.''

అఘోరుడి సంతతి వాళ్ళు ఇప్పుడు అన్ని కులాలలోనూ, మతాలలోనూ, భాషలలోనూ, దేశాలలోనూ ఉండి, మనుషులంతా ఏకం కాకుండా చెయ్యగలుగుతున్నారు. వారి నిజస్వరూపం బయట పెట్టి, మనుషుల మధ్యనుంచి వారిని తరిమివేయ గలిగే వరకూ భూమిమీద శాశ్వతమైన శాంతి నెలకొనదు!

యజ్ఞశర్మ కథ ముగించి, ''రాజా, ప్రజలు ఎప్పుడూ శాంతి జీవనాన్నే కోరుకుంటారు. వారు పోరాటానికి దిగారంటే, వారిని అలా పురికొల్పిన శక్తులు వారి మధ్యనే ఉంటాయి. అరాజక పరిస్థితి వల్ల లాభం పొందే వారెవరో తెలుసుకొని, వారు ఎంత సన్నిహితులైనా, పలుకుబడి గలవారైనా సంకోచించకుండా పురుగేరిన పక్షంలో దేశం అతిత్వరలోనే సుభిక్షమై, శాంతి నెలకొంటుంది.'' అన్నాడు.

శక్తిసేనుడు తన మంత్రి ఆంతర్యం గ్రహించి, తన రాజ్యంలో ఉండే ప్రచ్ఛన్న రాక్షసుల నందరినీ తొలగించి, మగధరాజ్యపు ప్రతిష్ఠను తిరిగి నెలకొల్పాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1980 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



P. Sundaram





Azmat A. Syed

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ అక్టోబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వాయిస్తే వాద్యం

రెండవ ఫోటో : చూపిస్తే చోద్యం

పంపినవారు : కె. లలిత, A 5/3, జీవన్ నగర్, బొంబాయి - 81

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# బ్రిటానియా పాల బిస్కట్

## పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!




రుచికరమైన, పుష్టికరమైన

**బ్రిటానియా**

**మిల్క్ బికీస్**

లింటాస్-BBC.MB.3-1712 TL

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు - 26

# రుచికరమైన కమ్మదనం
# రమ్యమైన క్రొత్తదనం నూతన

# న్యూట్రిన్
## మార్వెల్ రేంజ్




**జిక్కో క్కో మిఠాయి యందు**
**ఫలరస పూరిత విందు!**

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ
కంపెనీ లిమిటెడ్,
చిత్తూరు-517 002
(ఆం.ప్ర.)

మాయొక్క మింట్,
జింజెర్, ఫ్రూట్,
హనీ, కార్డమమ్
మిఠాయిల్ని
రుచి చూడండి

CAS NC 48/80 TE B


ACCOUN





# రామ్ శ్యామ్

## మోసగాళ్ళఎత్తుకు పైఎత్తు



















